యజుర్వేదీయ

# పురుష సూక్తము

## సరళ వైజ్ఞానిక వ్యాఖ్య - ఆంగ్లవ్యాఖ్యా సహితము




మంత్రకర్త :

**సృష్టికర్త పరమేశ్వరుడు**

సరళార్థ కర్త :

**సుమ్నార్థి**

(డా. కోదూరి సుబ్బారావు)

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**




యజుర్వేదీయ

# పురుష సూక్తము

సరళ వైజ్ఞానిక వ్యాఖ్య - ఆంగ్లవ్యాఖ్యా సహితము




మంత్రకర్త :

సృష్టికర్త పరమేశ్వరుడు

సరళార్థ కర్త :

సుమ్నార్థి

(డా. కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 54.
ప్రథమ ముద్రణ ప్రతులు : 1000.
సర్వస్వామ్యములు : గ్రంథకర్తవి © Copy Right.
సృష్టి సంవత్సరము : 196,08,53,113 (మన్వంతర సంధి రహితము).
197,29,49,113 (మన్వంతర సంధి రహితము).
విక్రమాబ్దము : 2069.
దయానందాబ్దము : 189.
శ్రీ నందన కార్తీక శు॥ ఏకాదశి (24-11-2012).

**మూల్యము** : **20/-** (తపాలా ఖర్చులు అదనం)

ప్రతులకు :

1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (P.O.) ; (Via.) భువనగిరి - 508 116.
సెల్ : 9290604641, 9908994084.

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6, వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.
కార్యదర్శి : శ్రీ కె.పి. నర్సింగ రావు. సెల్ : 98480 11073.

3. ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.

4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్ - 500 003.
ఫోన్ : 040-6632 0300.

5. శ్రీ విద్యా బుక్ డిపో మరియు గోపాల్ బుక్ హౌస్,
ఆర్యసమాజము ఎదురుగా, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.

6. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 6632 0300.



# విరాట్ పురుషునకు హవిస్సుతో వందనాలు

యేన దౌరుగ్రా పృథివీ చ దృఢా
యేన స్వః స్తభితం యేన నాకః ।
యో అంతరిక్షే రజసో విమానః ।
కస్మై దేవాయ హవిషా విధేమ ॥

-యజుర్వేదం (32-6)

ఎవనిచే తీక్ష్ణ స్వభావముగల సూర్యాదిలోకాలు మరియు ఈ భూమియు దృఢముగా ధరింపబడియున్నవో, ఎవనిచే (స్వః) స్వర్గ సుఖము ధరింపబడియున్నదో, ఎవడు (నాకః) మోక్షానందము నొసంగునో, ఎవడు ఆకాశమున పక్షులవలె సమస్త లోక లోకాంతరాలను త్రిప్పుచున్నడో, అట్టి సుఖదాయక పరమేశ్వరునకు పూర్ణ పురుషార్థరూప హవిస్సుతో నమస్కరించుచున్నాను.

He by whom the glowing sun and the Earth have been made firm, who has held under His possession the pleasure and the supreme bliss of salvation, who has measured, created and gave motion to all the worlds in the unbounded space moving in the manner as birds fly in it, to that all blissful divinity we offer our worship with our full devotion and effort.

## సరళార్థకర్త ఆలోచనలు ..............

వేదాలు సృష్టికర్త ఉపదేశాలు. తన అనంతమైన జ్ఞానంతో శక్తి సామర్థ్యాలతో అద్భుతమైన ఈ సృష్టిని జీవులమైన మనకోసం చేశాడు. విశిష్టప్రాణిగా మానవుని సృజించి జ్ఞానగ్రహణ సామర్థ్యంగల బుద్ధిని అతని కిచ్చాడు. ఆ బుద్ధికి విషయంగా సృష్ట్యాదిలోనే అతనికి కావలసిన సమస్త విద్యలను వేదాలలో యిమిడ్చి ఇచ్చాడు. అవి ఆనాటినుండి ఈనాటివరకు అనుశృతంగా, యథాతథంగా నిలిచి ఉన్నాయి. కనుకనే వాటిని శ్రుతులన్నారు. ప్రధానంగా ఋగ్వేదం పదార్థ విజ్ఞానాన్ని, యజుర్వేదం కర్మకుశలతను, సామవేదం ఉపాసనా సాధనను, అథర్వవేదం విజ్ఞానకాండను ఉపదేశిస్తాయి. విశేషంగా కొన్ని మంత్రాలు 2,3,4 వేదాలలో పునరావృత మౌతాయి. అట్టిదే ఈ పురుషసూక్తమునూ. జ్ఞాన, కర్మ, ఉపాసనా, విజ్ఞాన రంగాలలో ఏ రంగంలో ఉన్నవారికైనా ఈ పురుషసూక్తం అవసరమని పరమేశ్వరుని అభిప్రాయం కావచ్చు.

ఈ పురుషసూక్త అర్థం భావార్థంగాకాక మంత్రాలలోని వాక్యాలకు అర్థంగా వ్రాశాను. దీనివల్ల మంత్రపాఠం చేస్తున్నప్పుడు ఆ యా వాక్యాల అర్థం సులువుగా అర్థభావనతో జరుగుతుంది. నేటి ఆంగ్లమాధ్యమ విద్యాబోధనవల్ల తెలుగు పదాల అర్థం కొందరకు అవగతం కావటం లేదు. అందుచే ఆంగ్ల వ్యాఖ్య కూడ దీనితో చేర్చటం జరిగింది. ఆంగ్లవ్యాఖ్య నాది కాదు. మహాత్మా దేవీచంద్ ఎం.ఏ., గారిది. వారి ఆంగ్ల యజుర్వేదం నుండి గ్రహించితిని. వారికి నా హార్దిక కృతజ్ఞతలు.

దాతలకు, సహాయకులకు, ప్రింట్‌షాప్ వారికి నా ధన్యవాదములు

సుమ్నార్థి

(డా. కోడూరి సుబ్బారావు)



ఓ౩మ్

తనకు తాను వైదిక ధర్మప్రచారానికి అంకితమై రాయలసీమ ప్రాంతంలో విస్తృతంగా వైదిక ధర్మప్రచారం చేసిన విద్వాంసులు, నిరాడంబరులు, త్యాగధనులు, తపస్వి, సేవాతత్పరులునైన కీ.శే. విద్వాన్ వం. వంకం సుబ్బన్నగారి సంక్షిప్త పరిచయం

వీరు రాయలసీమ ప్రాంతంలోని కడపజిల్లా ప్రొద్దుటూరు వాస్తవ్యులు. శ్రీమతి వంకం కొండమ్మ, శ్రీ వెంకటపతి గార్ల సుపుత్రులు. వీరిది పారిశ్రామిక కుటుంబము. వీరి తండ్రిగారు పెద్దగా చదువుకోకపోయినా వివేకవంతులు. అందుచే ఆర్యసమాజానికి దగ్గరై **'సత్యార్థ ప్రకాశం'** చదువుకుంటూ, జపధ్యానాదులలో గడపేవారు. ఆ బీజాలే శ్రీ సుబ్బన్నగారిలోను నాటుకున్నాయి. వీరి విద్యాభ్యాసం వీధి బడిలోనే జరిగింది. ఆనాటి వీధిబడులు విద్యార్థులకు గట్టి పునాదులేవేసేవి. అందుచే శ్రీ సుబ్బన్నగారు గురువు శ్రీ దూదేకుల పుల్లయ్యగారివద్ద అమరము, త్రికాండములు, ఆంధ్రనామ సంగ్రహము, సత్యార్థప్రకాశంలోని శ్లోకాలు నేర్చుకున్నారు. కంఠస్థం చేశారు. తదుపరి బడిమానుకొని తండ్రికి నేతపనిలో సాయంచేస్తూ కొంతకాలం గడిపారు. తరువాత మరల వారికి చదువుకోవాలని సంకల్పం కలిగి గుంటూరువద్ద గల అమృతలూరు గ్రామవాసులైన శ్రీ నాగలింగం వెంకటేశ్వర శాస్త్రులు గారి సహకారంతో మద్రాసు యూనివర్సిటీవారు నిర్వహించే విద్వాన్ పరీక్ష వ్రాసి ఉత్తీర్ణులై 'ఎ' క్లాసు సర్టిఫికెట్ పొందారు. దానితో ప్రొద్దుటూరు మున్సిపల్ హైస్కూల్‌లో తెలుగు పండితునిగా ఉద్యోగం దొరికింది.

1979వ సంవత్సరంలో పూజ్యపాద శ్రీ గోపదేవశాస్త్రిగారితో పరిచయం కలిగి వారి వద్ద ఆర్యసమాజ సిద్ధాంతాలు లోతుగా అధ్యయనం చేశారు. అప్పటినుండి నిత్యం అగ్నిహోత్రం చేస్తూ తమ ఇంటికి 'వైదిక భవన్' అని పేరు పెట్టుకుని, సత్సంగాలు నిర్వహిస్తూ యింటినే ఆర్యసమాజంగా చేసుకున్నారు. 1991 సం॥లో ఉద్యోగ విరమణను పొంది పూర్తిగా వైదిక ధర్మానికి అంకితమై ఆర్యసమాజ వ్యాప్తికై కృషి చేశారు. గురువుగారు స్థాపించిన సత్యార్థ ప్రకాశ ట్రస్టునకు తమ సేవలందించారు.

వీరికి సంస్కృత, ఆంధ్ర భాషలపైన మంచి పట్టు ఉంది. కనుకనే 1970 సం॥లో ఆది శంకరాచార్యులవారు రచించిన 'శివానందలహరి' స్తోత్రాన్ని వీరు తెలుగు పద్యములుగా అనువదించి అప్పటి కంచి కామకోటి పీఠాధిపతులచే సన్మానం పొందారు. ఎవరైనా పెద్దలు, పిన్నలు ఆశీస్సులు వ్రాసి పంపమని కోరితే పద్యాలలోనే ఆశీస్సులు వ్రాసి పంపే ప్రవృత్తి కలవారు. వీరు ఆర్యసమాజికులైన తరువాత ఎవరు ప్రచారానికి పిలిచినా దక్షిణ ఎంత యిస్తారని ఆలోచించక వెళ్ళి ప్రచారం చేసి వచ్చేవారు. తనకు అయాచితంగా వచ్చిన దక్షిణలను కూడా సమాజ నిర్మాణాలకు, వైదిక ధర్మవ్యాప్తికి ఖర్చుపెట్టేవారు.

రాయలసీమ జిల్లాలలో శ్రీ సుబ్బన్నగారు చేసిన ప్రచారం వల్ల చాలా మంది ప్రభావితులయ్యారు. మూర్తిపూజను, మూఢనమ్మకాలను వదలి యజ్ఞోపవీతాన్ని ధరించి సంధ్యాగ్నిహోత్రాలు చేసుకుంటూ, జీవిత పితరులకు సేవచేస్తూ, శక్తికొలది పరోపకారం చేసేవారయ్యారు. వారిలో ముఖ్యులు మొరగుడి, వేపరాల, అనంతపురం, ప్రొద్దుటూరు వాసులు. మొరగుడి గ్రామంలో ఆర్యసమాజ ఆశ్రమాన్ని స్థాపించారు. ఒక దాత ఉచితంగా స్థలం యివ్వగా కొందరి దాతల సహకారంతో శ్రీ సుబ్బన్నగారే అక్కడ ఒక భవనాన్ని నిర్మించారు. శ్రద్ధాభక్తులతో కొందరు ప్రతీరోజు అక్కడకువచ్చి సంధ్యాగ్నిహోత్రాలు చేసుకుంటారు. ప్రతీ అమావాస్యరోజున రుద్రయాగం చేసి సత్సంగం నిర్వహించి వచ్చినవారందరికీ భోజనాలు పెడతారు. శ్రీ సుబ్బన్నగారు ఆ బాధ్యతను తన కుమార్తె శ్రీమతి పద్మావతి గారికి అప్పగించారు. ఆమె ఆ పనిని శ్రద్ధతో చేస్తున్నారు. మొరగుడికి 10 కీ.మీ.దూరంలోని వేపరాల అనే గ్రామంలోనూ ఆర్యసమాజాన్ని స్థాపించారు. అనంతరం వారు ఒక భవనాన్ని కూడా నిర్మించుకున్నారు. శ్రీ సుబ్బన్నగారు కొంతకాలం అనంతపురం పట్టణంలో సాప్తాహిక సత్సంగాలు నిర్వహించారు. దానితో కొందరు ప్రభావితులై విగ్రహారాధన విడచి సంధ్యాగ్నిహోత్రాలు చేసేవారయ్యారు. వారిలో ముఖ్యంగా శ్రీ కొనిరెడ్డి వెంకట రెడ్డి అను వ్యవసాయదారుడు చాలా ప్రేరణ పొంది అనంతపురంలో (రుద్రంపేటలో) ఆర్యసమాజం స్థాపించటానికి (భవన నిర్మాణానికి) 25 సెంట్ల భూమిని దానంగా యివ్వటమే కాక ఉదయ సాయంకాలాల్లో 2 కిలోమీటర్ల దూరంనుండి వచ్చి రెండుపూటలా సత్సంగం నిర్వహిస్తారు. వీరు పూర్వం విగ్రహారాధకులు. ఒక రామాలయం కట్టించినవారు కూడా. వీరును

అమావాస్య పూర్ణిమలలో రుద్రయాగం చేస్తారు. ఇంతేగాక, ఆర్యసమాజ ఖర్చుల కొరకు వీరు 5 ఎకరముల భూమిని ప్రత్యేకంగా కొని సమాజం పేరుతోనే రిజిష్టరు చేయించారు. ప్రతీపని నిస్వార్థంగా చేసే కర్మయోగులుగా తయారయ్యారు. దీనిని బట్టి శ్రీ సుబ్బన్నగారి ప్రేరణ ఎంతటి ప్రభావవంతమో మీరే ఊహించండి.

వీరి ధర్మపత్ని శ్రీమతి మల్లమ్మగారు శ్రీ సుబ్బన్నగారుచేసే ప్రతీ ధర్మకార్యంలోను చేదోడు వాదోడుగా ఉండేవారు. ఇంతేగాక, వారికి వైదిక ధర్మంపై చాలా శ్రద్ధ ఏర్పడింది. తన చివరి కోరికగా తన అనంతరం తన వంటిపై నున్న బంగారాన్ని అమ్మి ఒక బ్రహ్మచారిని గురుకులానికి పంపి చదివించి పండితుణ్ణి చేయమని కోరారు. శ్రీ సుబ్బన్నగారు అట్లే చేశారు. కాని, ఆ విద్యార్థి 5 సంవత్సరాలు చదివి తిరిగి యింటికి వచ్చివేశాడు. ఆమె కోరిక నెరవేరలేదు.

శ్రీ సుబ్బన్నగారు తమ చివరి జీవితాన్ని కూడా చాలా ప్రేరణాత్మకంగా గడిపారు. తనను చూడవచ్చిన ఆర్యసమాజికులకు, తోటి ఉపాధ్యాయులకు, బంధుమిత్రులకు, అభిమానులకు చక్కటి సందేశాలను ఇచ్చారు. వారు దేహాన్ని విడిచే ముందు రోజు సాయంత్రం కొందరి కార్యకర్తల సమక్షంలో యజ్ఞం చేసి సత్సంగం చేస్తూ – "తలకు పాగా చుట్టుకుని వెళ్ళిపోతుంది తన ఆత్మ" అని అన్నారట. ఆ రాత్రి గడచి తెల్లవారుతూ ఉండగా (24-11-2009) రోజు తెల్లవారు ఝామున 5 గంటలకు వారు పార్థివ శరీరాన్ని విడచి దేవయాన మార్గంలో పయనిస్తూ దివంగతులయ్యారు. అట్టి స్థితి ఏ కొద్దిమందికో వస్తుంది. "కీర్తిర్యస్య స జీవతి" అంటూ అందరూ శ్రద్ధాంజలులు ఘటించారు.

నాకు (సుమ్నార్థి – కోదూరి సుబ్బారావునకు) 1985 సం॥రం నుండి వీరితో పరిచయము. వీరు తరచుగా సీతాఫలమండి ఆర్యసమాజానికి, నేను నివసించే గదికి (మేడిబావి సమాజంలోని నా గదికి) వచ్చి కలిసి కొంతసేపు ప్రేమతో మాట్లాడి వెళ్ళేవారు. ఇద్దరి మనస్తత్వాలు ఒకటి కావటంతో మా మధ్య గట్టి స్నేహం ఏర్పడింది. వీరు వెూరగుడిలో ఆశ్రమం ఏర్పాటు చేసినపుడు వీరికిచ్చిన డబ్బు సద్వినియోగమౌతుందని రూ. 10,000/–లు నేను విరాళముగా యిచ్చితిని. దానితో వారు చాలా తృప్తి చెంది నాకు ఇంతవరకు వచ్చిన దానాలలో మీదే పెద్దదని తమ కృతజ్ఞత వ్యక్తం చేశారు. అనంతరం తరచుగా ఆశ్రమాభివృద్ధిని గురించి విని మరొక రూ॥5,000/– విరాళంగా ఇచ్చితిని. ఈ విధంగా మా పరిచయాలు పెరిగాయి.

నా శరీరం చాలా బలహీనమైనది కావటంవల్ల అంతదూరం ప్రయాణం చేయలేక పోవుటచే నేనెప్పుడూ ఆశ్రమానికి వెళ్ళలేకపోయాను. అయినా నా డబ్బు సద్వినియోగమైనందుకు సంతోషించేవాడిని.

అనంతరం నేను కామారెడ్డి ఆర్షగురుకులానికి వెళ్ళిపోయినా అప్పుడప్పుడు మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేవి. వీరు ప్రతినెల ఒక కరపత్రం ముద్రణ చేయించి స్థానికంగా రాయలసీమ ప్రాంతంలో వితరణ చెయ్యటమే కాక సుమారు 40 కేంద్రాలకు పత్రికలను తపాలాలో పంపేవారు. వీరి ఈ సేవను గుర్తించి శ్రీ పి.వి. రమణారెడ్డిగారు ఆ కరపత్రాల నన్నిటిని భద్రపరచి 61 కరపరత్రాలను ఒక పుస్తకంగా ప్రచురించి వీరికివ్వటం జరిగింది. వారు వెంటనే నా కొక ప్రతి (కామారెడ్డికి) కొరియర్ పోస్టులో పంపారు. ఆ పుస్తకం ఇప్పటికీ నావద్ద భద్రంగా ఉంది. నేను భువనగిరికి వైదిక వానప్రస్థ ఆశ్రమానికి వచ్చిన తదుపరి ఒకసారి ఇక్కడకు వచ్చి నన్ను, ఆశ్రమాన్నీ చూసి వెళ్ళారు. అట్టి మరపురాని మహానుభావునకు నా హృదయపూర్వక శ్రద్ధాంజలిగా ఈ పుస్తకాన్ని అర్పించుచున్నాను.

శ్రీ సుబ్బన్నగారికి సంతానం ఒకే అమ్మాయి. ఆమెను తన బావమరిదికే (శ్రీ బహదూర్ కొండప్ప - రిటైర్డ్ రైల్వే స్టేషన్ మాస్టర్ గారికే) యిచ్చి వివాహం చేశారు. తన ఇంట్లోనే పెట్టుకుని ఆదరించారు. అమ్మాయికి, అల్లునికి కూడా వైదికధర్మం పట్ల చక్కటి శ్రద్ధను కలిగించారు. ఇప్పుడు వారిద్దరూ శ్రీ సుబ్బన్నగారికి అనువ్రతులై వారు ప్రారంభించి నడిపించిన యజ్ఞ సత్సంగాది కార్యక్రమాలన్నీ మిక్కిలి శ్రద్ధాభక్తులతో చేస్తున్నారు. వారు అభినందనీయులు. ఆదర్శవంతులు. ఈ పుస్తక ముద్రణకగు వ్యయాన్నంతా మా ట్రస్టునకు దానముగా యిచ్చుచున్నారు. వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు. పరమేశ్వరుడు ఈ దంపతులకు దీర్ఘ ఆయురారోగ్యాలనిచ్చి కాపాడును గాక! వీరి ద్వారా రాయలసీమ ప్రాంతంలో మరింతగా వైదిక ధర్మం విస్తరించవలెనని ఆకాంక్షిస్తున్నాను.

ఈ పుస్తక 150 ప్రతులను రాయలసీమ ప్రాంతంలో శ్రద్ధాలురకు వితరణ చేయుటకు పంపుచున్నాను.

- సుమ్నార్థి (గ్రంథకర్త)
గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము

ఓ౩మ్

# పురుష సూక్తము

## (యజుర్వేదీయము)

వేదాలు భారతీయార్యుల ధర్మగ్రంథాలు. అవి సృష్ట్యాదిలో పరమేశ్వరుని ద్వారా మానవులకు లభించిన జ్ఞానభండారాలు. మానవులకు కావలసిన సమస్త విద్యావిజ్ఞానాలు వేదాలలో ఉన్నాయని భారతీయ మహర్షుల ప్రగాఢ విశ్వాసం. అయితే, అవి బీజరూపంలో ఉంటాయి. వాటిని వెలికి తీయాలంటే వేదాంగాలైన శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందోజ్యోతిషాల అధ్యయనం అనివార్యం. లేకుంటే వాటిని ఉన్నది ఉన్నట్లుగాకాకుండా మరొకరకంగా అర్థం చేసుకునే ప్రమాదం ఉంది. విపరీతంగానూ అర్థం చేసుకోవచ్చు. అధ్యయనంతో బాటు అంతర్ముఖులై మంత్రార్థదర్శనం చెయ్యటమూ అవసరమే నంటారు ఋషులు. మంత్రార్థదర్శనమంటే యమ నియమాలు పాటిస్తూ, పతంజలి మహర్షి యోగదర్శనంలో చెప్పిన మార్గంలో యోగాభ్యాసం చేస్తూ సమాధిస్థితిలోనికి వెళ్లి అంతర్యామినుండి ఆ మంత్రార్థం తెలుసుకోవటం. ఋతంభరా ప్రజ్ఞను పొందటం. దీనినే 'ఋషిత్వం' అంటారు. అట్టి ఋషులు చేసిన వ్యాఖ్యానాలే భ్రమ ప్రమాద రహితంగానూ, హేతుబద్ధంగానూ, విజ్ఞానసమ్మతంగాను ఉంటాయి.

మన ప్రాచీన వైదిక సాహిత్యాన్ని పరిశీలిస్తే అట్టి మంత్రార్థ దర్శనం పొందిన మహర్షులు పెక్కురు కనబడతారు. వారు రచించిన శాస్త్రాలు అనేకం కనబడతాయి. సుదీర్ఘకాలంలో విభిన్న కాలపరీక్షల నన్నిటినీ తట్టుకొని నేటి విజ్ఞానానికినీ ఎదురొడ్డి నిలబడగల శక్తి మన దర్శన శాస్త్రాల కున్నది. అవి కేవలం ఆధ్యాత్మిక శాస్త్రాలేకాక విజ్ఞానశాస్త్రాలు కూడా.

'సృష్టికి కర్త అంటూ ఒకరులేరు. ప్రకృతిలో నెలకొని ఉన్న శాశ్వత నియమాలవల్లనే సృష్టి ఉత్పత్తి, స్థితి, ప్రళయాలు జరుగుతున్నా'యని వాదించే నాస్తికులు ప్రాచీన కాలంలోనూ ఉన్నారు. నేడును ఉన్నారు. మధ్యకాలంలో

ప్రకృతితోబాటు జీవతత్త్వాలు కూడా కొన్ని ఉన్నాయనే మతాలు (ద్రైవ తత్త్వాన్ని అంగీకరించనివి) కొన్ని వెలిశాయి. వీటిలో బౌద్ధ, జైన మతాలు ముఖ్యమైనవి. వీరును వారి అభిప్రాయాలను సమర్థించుకోవడానికి దర్శనాలు వ్రాశారు. వీటిలో చార్వాక, జైన, బౌద్ధ దర్శనాలు ముఖ్యమైనవి.

ప్రకృతి జీవతత్త్వాలే కాకుండా ఈ రెంటినీ వశంలో పెట్టుకొని సృష్టిని నియమంగా నడిపించే పరమేశ్వరతత్త్వం కూడా ఒకటుందని వేదం గట్టిగా, స్పష్టంగా చెబుతుంది. మన ప్రాచీన ఋషులంతా ఈ వేదమతాన్నే సమర్థించారు. అంతేకాక, నాస్తిక అభిప్రాయాలన్నిటిని ఖండించారు. అంటే వాటిలోని లోపాలను అనేక యుక్తులతో విశదపరచారు. అవే షడ్దర్శనాలు. న్యాయ, వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంత దర్శనాలు. ఈ విషయాలను వివరంగా తెలుసుకోగోరువారు మహర్షి దయానంద సరస్వతిగారి రచన 'సత్యార్థప్రకాశం' చదువ గోరుచున్నాము.

వేదం సృష్టిక్రమాన్ని సృష్టినియమాలను చెప్పటంతోపాటు మానవుని శారీరక భౌతిక సామాజిక ఆత్మికోన్నతులకు అవసరమైన ఉపాయాలను, అనుసరించవలసిన నియమ నిబంధనలను తెలుపుతుంది. విశేషించి పరమాత్మ స్వరూప స్వభావాలను వివరిస్తుంది. మానవుడు ఆ ఆత్మపరమాత్మల జ్ఞానంతో సాధనచేసి సమస్త దుఃఖాలనుండి, త్రివిధ శరీర బంధనాలనుండి, ప్రకృతి బంధనాలన్నిటినుండి విముక్తిని పొంది పరమానందరూపముక్తిని పొందుతాడు. అటువంటి పరమాత్మ జ్ఞానాన్ని అలంకారరూపంలో తెలిపేవే పురుషసూక్తాలు. ఇవి నాలుగు వేదాలలోనూ కనబడతాయి. కనుక, జ్ఞాన కర్మ ఉపాసనా విజ్ఞాన మార్గాలలో ఏ మార్గంలో ఉన్నవారైనా అందరికీ ఇవి అవసరమే నని పరమేశ్వరుని అభిప్రాయం.

ఋగ్వేద దశమ మండలంలోని 90వ సూక్తం పురుషసూక్తం. దీనిలో 16 మంత్రాలున్నాయి. యజుర్వేదంలోని 31వ అధ్యాయం పురుషసూక్తం. దీనిలో మిగతా వేదాలలో కన్న ఎక్కువగా 22 మంత్రాలున్నాయి. సామవేదంలో 617 నుండి 621 వరకు కేవలం 5 మంత్రాలే ఉన్నాయి. అథర్వవేదంలో 19వ కాండలోని 6వ సూక్తం పురుషసూక్తం. దీనిలో 16 మంత్రాలున్నాయి. ఈ 4 పురుషసూక్తాలలో అక్కడక్కడ పాఠభేదాలు, క్రమభేదాలు ఉన్నాయి.

అయినప్పటికీ అవన్నీ విరాట్ పురుషుని వర్ణనలే. ఈ చిన్ని పుస్తకంలో యజుర్వేద పురుషసూక్తానికి సరళార్థం వ్రాయబడుతున్నది. ఈ సరళార్థానికి ఆధారం మహర్షి దయానంద సరస్వతిగారి యజుర్వేద భాష్యం మరియు ఋగ్వేదాది భాష్యభూమికలోని సృష్టి విషయం.

ప్రాచీనకాలంలో వేదభాష్యాలు అనేకం ఉండి ఉంటాయి. కాని, విదేశీ దురాక్రమణలలో చాలావరకు అవి వారి విద్వేషాగ్నికి దగ్ధమయ్యాయి. నేడు కొన్ని వేదభాష్యాలు మాత్రమే లభిస్తున్నాయి. వాటిలో సాయణ, మహీధర, ఉవ్వట, భట్టు భాస్కర, మాధవ, వెంకట మాధవ, స్కన్ద, ఉద్గీథ మొదలైనవి ముఖ్యమైనవిగా ఎంచబడుతున్నాయి. వీరంతా వేదానికి యాజ్ఞికపరంగానే అర్థం వ్రాశారు. బహుశః ఆనాటి పరిస్థితులే అందుకు కారణం కావచ్చు. యాజ్ఞిక ప్రక్రియలలో కొన్ని తాంత్రిక భావాలు చోటు చేసుకున్నాయి. యజ్ఞాలలో పశుహింస, మద్యసేవనం, అశ్లీలక్రియా కలాపాలు జొరబడ్డాయి. ఇవి జైన మతస్థులైన ఉవ్వట మహీధరాదులకు ఆయుధాలుగా దొరికాయి. వీటిలో వేదార్థానికి న్యాయం జరుగలేదు. చాలా సందర్భాలలో వేదాల ఆశయాలకే భిన్నంగా అవి ఉన్నాయి. కొన్ని అశ్లీల వ్యాఖ్యలూ చేశారు. కాని, వేదాలు యజ్ఞాన్ని శ్రేష్ఠతమ కర్మగా, చాలా పవిత్రకార్యంగా వర్ణించాయి. యజ్ఞపదంలోనే చాలా మంచి అర్థం ఉంది. తనకు, ఇతరులకు ప్రాణిమాత్రులన్నిటికీ దేనివల్ల ఉపకారం కలుగుతుందో దానిని యజ్ఞమంటారు. అధ్వర పదంలోనూ 'ఏవిధమైన హింసా లేని'దనే అర్థం ఉంది. వీటికి భిన్నంగా వారి భాష్యాలున్నాయి.

భారతీయుల ఖగోళ, వైద్య, యంత్ర, విమానాది శాస్త్రాలకు మూలం వేదాలని ప్రపంచ మేధావులకు అవగతమయ్యింది. దానితో 20వ శతాబ్దంలో యూరోపియన్ విద్వాంసుల దృష్టి వేదాలపై మరలింది. సర్వశ్రీ ప్రొ. విల్సన్, బ్లూం ఫీల్డ్, హేరేన్, మాక్స్‌ముల్లర్, గ్రిఫిత్, కోలీ బ్రూక్, మోయర్, లుడ్‌విగ్ మొదలైనవారు వేదాలపై చాలా అధ్యయనం చేశారు. కాని, వీరికిని వేదార్థం బోధపడలేదు. వీరంతా ఎక్కువగా సాయణాచార్యులవారి భాష్యాన్ని అనుసరించటం వల్లను ; ఆర్షవ్యాకరణం, వేదార్థశైలి తెలియకపోవటం వల్లను వారి ప్రయాస వ్యర్థమయ్యింది. మహర్షి దయానంద సరస్వతిగారి వేదభాష్యం,

ఋగ్వేదాది భాష్యభూమిక మొదలగునవి చదివిన తదుపరి ప్రొ. మాక్స్‌ముల్లర్ పండితుడు కొంత గ్రహించారు. 'వేదాలు బృహత్ విశ్వకోశాలు. వాటిలో మానవుల కవసరమగు జీవన విధానం, సంస్కృతీ సభ్యతలు చెప్పబడ్డాయి. ధర్మము, ధ్యానయోగ సాధనలు, వివిధ విజ్ఞాన విషయాలు, భౌతిక నియమాలు, గ్రహనక్షత్రాల విజ్ఞానం, సామాజిక నియమాలు మొదలైన ఎన్నెన్నో విషయాలున్నా'యని వారు గ్రహించటమేగాక వారి పుస్తకాలలో (సైన్స్ అండ్ రిలీజియన్–Science and Religion) లో వ్రాసుకున్నారు.

మహర్షి దయానంద సరస్వతి (1824–1883) గారు గొప్ప వ్యాకరణ విద్వాంసులేగాక నైష్ఠిక బ్రహ్మచారులు, తపస్వులు, యోగులు. అన్నిటిని మించి వారు అనన్య వేదభక్తులు. సమస్త సత్యవిద్యలకు–అంటే విద్యావిజ్ఞానాలకు, కళా కౌశలాలకు, వివిధ వృత్తులకు, వైయక్తిక కౌటింబిక సామాజిక నీతులకు, రాజనీతికిని వేదం మూలగ్రంథమని వారి ప్రగాఢ విశ్వాసం. భారతీయ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథాలకును వేదాలే స్రోతస్సులని వారి నమ్మకం. వారు ప్రాచీన నవీన వేదభాష్యాలన్నిటిని పరిశీలించి నవీన వేదభాష్యాలలోని లోపాలను గుర్తించారు. ప్రాచీన వేదార్థప్రక్రియను పునరుద్ధరించ మిక్కిలిగా శ్రమించారు. అందుకు బ్రాహ్మణ ఆరణ్యక నిరుక్త ఉపనిషదాది ఆధ్యాత్మిక గ్రంథాలను, రామాయణ భారతాది ఇతిహాస గ్రంథాలను చక్కగా అధ్యయనం చేసి ఎక్కడెక్కడ వేదార్థప్రక్రియకు చెందిన విషయాలున్నా వాటిని సేకరించి మనన చింతనలను చేశారు. యోగాభ్యాసం చేసి సమాధిస్థితిలోనికి వెళ్లి అంతర్యామినుండి (సృష్టికర్త వేదకర్తయైన పరమేశ్వరుని నుండి) సత్యార్థాన్ని గ్రహించారు. ఆ ఋతంభర ప్రజ్ఞతోనే వారు ఋగ్వేదాది భాష్యభూమిక, యజుర్వేదానికి పూర్తిగాను, ఋగ్వేదంలోని సప్తమ మండలం 60వ సూక్తం వరకు భాష్యం వ్రాశారు. దురదృష్టవశాత్తు తీవ్రమైన విషప్రయోగానికి గురియైనారు. ఎంత ప్రయత్నించినా ఆ తీవ్రమైన ప్రభావం నుండి విముక్తిని పొందలేకపోయారు. శరీరం యిక బాగుకాదని తెలుసుకొని స్వేచ్ఛగా శరీరాన్ని వదిలి తృతీయధామానికి–ముక్తిధామానికి వెళ్లిపోయారు. వారి వేదభాష్యాన్ని అనుసరించే ఈ పురుష సూక్తానికి సరళార్థం వ్రాయబడింది.

## పురుషు డంటే ఎవరు?

సామాన్యంగా పురుషు డంటే మానవులలో మగవాడని అనుకుంటారు. కాని, ఆధ్యాత్మిక గ్రంథాలలో పురుష పదం మూలార్థాన్ని బట్టి ప్రయోగింపబడినది. ఆర్ష వ్యాకరణాన్ననుసరించి పురుష పదం **'పూ పాలన పూరణయోః'** అను ధాతువు నుండి నిర్మితమౌతుంది. కనుక 1. పాలించేవాడు పోషించేవాడు అని ఒక అర్థం. పూర్ణంగా ఉండేవాడు, పూర్ణం చేసేవాడు నని మరియొక అర్థం. యాస్క మహర్షి వ్రాసిన నిరుక్త నిఘంటువులలో ఈ పదం మరికొంత వివరింపబడింది. 'పురుషం పురిశయ ఇత్యాచక్షీరన్' (ని. 1-11) పురంలో శయనించేవాడు కనుక పురుషు' డంటుంది. ఈ దృష్టితోనే ఆధ్యాత్మిక శాస్త్రాలలో పురుష పదం ప్రయోగింపబడింది. కనుక ప్రకరణాన్ని (సందర్భాన్ని – contextను) బట్టి పురుష పదం పరమేశ్వరునికి, జీవునికి, ప్రకృతికూడా వర్తిస్తుంది.

జగత్ప్రసిద్ధమైన భగవద్గీత ఈ పురుషపదానికి మూడు విశేషాణాలను జోడించి సృష్టిలోని మూడు మూల పదార్థాలను వేరువేరుగా వివేచిస్తుంది. ఈ క్రింది శ్లోకాలను పరిశీలించండి.

శ్లో. ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥

శ్లో. **ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।**
**యో లోక త్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥**

–భగవద్గీత (15-16,17)

ఈ సృష్టిలో క్షరపురుషుడు, అక్షరపురుషుడు నని రెండు రకాల పురుషులున్నారు. వారిలో పంచభూతాలతో ఏర్పడిన ప్రాపంచిక పదార్థాలన్నీ క్షరపురుషుడు. రెండవ పురుషుడు కూటస్థపురుషుడు-జీవాత్మ.

ఈ రెండు రకాల పురుషులే గాక మరొక ఉత్తమ పురుషుడున్నాడు. అతనినే 'పరమాత్మా' అంటాయి శాస్త్రాలు. ఆ పరమాత్మ తత్త్వం భూలోక భువర్లోక (అంతరిక్షలోక) స్వర్లోక (ప్రకాశించే సూర్య నక్షత్రాదులుండే లోకా)ల

లోను-త్రిలోకాలలోనూ వ్యాపించి వాటిని ధరించి ఉంది. అది అవ్యయము నశించనిది. అది ఈశ్వరుడు - అన్నిటికి స్వామి. అది ఒకే ఒక్కటి.

ఈ విధంగా భగవద్గీత వివరిస్తుంది. వీటిని గూర్చి మరికొంత వివరంగా తెలుసుకుందాము.

**క్షరపురుషుడు** (సృజింపబడిన ప్రకృతి) :-

క్షర మంటే నశించేదని సామాన్యార్థం. నాశనం అంటే లేకుండా పోవడం కాదు. 'కారణలయః' తన కారణంలో (మూల పదార్థంలో) లయించి పోవటం (కలిసిపోవటం). ప్రపంచంలోని పదార్థాలు సదా మార్పు చెందుతూ ఉంటాయి. చివరకు నశించిపోతాయి. మూల పదార్థంగా మారిపోతాయి. ఉదా:- 1. నీరు వేడికి ఆవిరియై మేఘమై వర్షించి మరల నీరుగా మారిపోతుంది. 2. మట్టి ఇటుకయై చాలాకాలం తరువాత శిథిలమై క్రమంగా మట్టిగా మారిపోతుంది. ఇట్లే ప్రాపంచిక పదార్థాలన్నీ మార్పు చెందుతూ ఉంటాయి. మహాప్రళయకాలంలో పంచభూతాలు కూడా విడిపోయి పరమాణువులుగా మారి మూల ప్రకృతిగా మారిపోతాయి. కనుక ఈ సృష్టిని క్షరపురుషుడన్నారు.

సృష్టి అనే పురంలో ఈ పరమాణువులు విస్తరించి శయనించి ఉంటాయి కనుక పంచభూతాలుగా ఉన్న ప్రకృతిని క్షరపురుషుడన్నారు.

**2. అక్షర పురుషుడు** (నశించని పురుషుడు) :-

ఈ ప్రసంగంలో నశించని పురుషునిగా జీవాత్మను పేర్కొనటం జరిగింది. జీవాత్మ శరీరకూటంలో ఉంటుంది. ఇచట కూటం అంటే ప్రాకృతిక పదార్థాల కలయికతో ఏర్పడినది లేదా కాల్షియం, పొటాషియం, మెగ్నీషియం, ఐరన్ మొదలైన మూలకాలతో (elements తో) ఏర్పడినదని అర్థం. అట్టి శరీరకూటంలో ఉన్న జీవాత్మ అక్షరుడు - నశించడు. మార్పు చెందదు. శరీరానికి వృద్ధి క్షయ నాశనాలుంటాయి. కాని, జీవాత్మ కవి ఉండవు. ఒక శరీరం శిథిలమైపోతే పరమేశ్వరుడు మరొక శరీరాన్ని నిర్మించి అందులోనికి ఆ జీవుణ్ణి ప్రవేశపెడతాడు. మనమంతా అట్టి అక్షర పురుషులమే. జీవాత్మలమే.

శరీరం అనే పురంలో శయనించి తన శక్తిని శరీరమంతా విస్తరింప చేస్తూ ఉంటాడు కనుక జీవాత్మను కూడ పురుషుడంటారు. స్త్రీ-పురుషభేదం

శరీరానికే గాని జీవాత్మకుండవు.

**3. ఉత్తమ పురుషుడు :-**

ఉత్తమ పురుషు డంటే సృష్టిరూప క్షర పురుషునికన్నను, జీవాత్మయైన అక్షర పురుషుని కన్నను ఉత్తముడైన పురుషుడు. అతడినే పురుషోత్తముడు, పరమాత్మ, పరమేశ్వరుడు అంటారు. అతడు సృష్టి స్థితి లయ కర్త. సృష్టి స్థితిలయాలు మూడునూ సాక్షికంగా విశ్వమంతటా ఇప్పుడునూ జరుగుతున్నాయి: కనుక అతడు విశ్వవ్యాపకుడు. బ్రహ్మాండపురంలో శయనించి యున్నాడు కనుక అతడు విరాట్ పురుషుడు. వేదాలలోని పురుషసూక్తాలలో ఈ విరాట్ పురుషుడినే అలంకారిక రూపంలో వర్ణించడం జరిగింది.

ధాత్వర్థాన్ని బట్టి చూచినా (పృ పాలన పూరణ యోః) పరమేశ్వరుడు సృష్టి అంతటా పూర్ణంగా వ్యాపించి అందలి సమస్త ప్రాణులను పాలిస్తూ పోషిస్తూ ఉంటాడు కనుక అతడునూ పురుషుడే.

## వైజ్ఞానిక వ్యాఖ్య

వైజ్ఞానిక మనగా విజ్ఞాన సమ్మతమైనదని అర్థం. విజ్ఞానపదం కేవలం నేటి భౌతిక విజ్ఞానానికే పరిమితం కాదు. ఆధ్యాత్మిక జ్ఞానం కూడా విజ్ఞానమే. అది భౌతిక విజ్ఞానం కన్నను గొప్పది. జ్ఞానరహితమైన భౌతిక పదార్థాలకన్న జ్ఞానవంతములైన ఆత్మ పరమాత్మలు గొప్పవి కావా? అట్టివాటిని గురించి వివరించే, దర్శింపజేసే ఆధ్యాత్మిక జ్ఞానం వైజ్ఞానిక మెందుకు కాదు?

ఇతర ప్రాణులలో నున్న జీవాత్మకన్న మానవ శరీరంలో ఉన్న జీవాత్మకు జ్ఞాన మెక్కువ. అందుకు కారణం పరమేశ్వరుడు ప్రసాదించిన బుద్ధి అనే అంతరింద్రియం. దానితోనే మానవుడు పురుషార్థం చేసి ఉన్నతోన్నత శిఖరాలకు చేరుకుంటున్నాడు. బుద్ధియును ప్రకృతితో ఏర్పడిన జడపదార్థమే. అది జీవునికి జ్ఞానగ్రహణ సాధనంగా ఉంటుంది. జీవాత్మ జ్ఞానం కలిగినదే అయినప్పటికీ దాని జ్ఞానం అల్పం. పూర్ణం కాదు. మానవుడు సృష్టిలోని పదార్థాలను కొన్ని మార్పులు చేసి కొన్ని సుఖాలను సమకూర్చుకోగలడేకాని, మూలకాలను, మూలకాలతో ఏర్పడే జీవరసాయనాలను, ప్రాణుల శరీరాలను నిర్మించలేడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఒక్క రక్తపుబొట్టును కూడా నిర్మించలేడు. అతడు

కూటస్థపురుషుడే కాని విరాట్‌పురుషుడు కాదు.

పురుషసూక్తంలో వర్ణింపబడిన పురుషుడు విరాట్‌పురుషుడు. అతడు పరమాణువులతో మూలకాలను (elementsను) చేయగలడు. ఆ మూలకాలతో జడపదార్థాలను, ప్రాణుల శరీరాలను నిర్మింపగలడు. అతని పరిమాణం అనంతం. కనుక ఈ సృష్టి, నక్షత్రరాశులు (గెలాక్సీలు–galaxies) అంతా కలిసి అతనిలో ఏకపాదంగా (1/4గా) ఉంది. అతడు సర్వవ్యాపకుడు కనుక పరమాణువులనూ వశంలో పెట్టుకోగలడు, జీవులనూ వశంలో పెట్టుకోగలడు. అతడు వాటిలోనూ వ్యాపించి యున్నాడు. మనం ఏదైనా వస్తువు నిర్మించడానికి పరికరాలు (పనిముట్లు) అవసరం. దేవుడు సర్వంలో వ్యాపించి యున్నాడు కనుక పరికరాల అవసరమేముంది? అట్లే, మనకు సహాయకు లవసరం కాని అతడు సర్వవ్యాపకుడు కనుక సహాయకు లవసరం లేదు. అతడు సర్వశక్తిమంతుడు కనుక కన్నులు లేకనే అన్నిటినీ చూడగలడు. చెవులు లేకనే అన్నిటినీ వినగలడు. మనం మనస్సులో అనుకున్నది కూడా అతడు తెలుసుకోగలడు. అతడు మనస్సులో కూడా వ్యాపించి యున్నాడు కదా! అందుచేతనే పురుషసూక్తం **'సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్షః సహస్రపాత్'** అంటూ ప్రారంభమౌతుంది. 'సహస్ర' అంటే సర్వత్ర అని అర్థం చేసుకోవాలి. అందుకనే **'సర్వతః పాణిపాద సర్వతోఽ క్షి శిరోముఖం. సర్వతః శృతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి'** అని వర్ణించారు మహర్షులు ఉపనిషత్తులలో. ఆ విషయాలన్నీ ఇక్కడ వివరించడానికి వీలుపడదు. తెలుసుకోగోరువారు మహర్షి దయానంద సరస్వతి విరచిత సత్యార్థ ప్రకాశంలోని 8వ సముల్లాసం చదవండి.

ఈ పురుషసూక్తంలో కేవలం ఆధ్యాత్మిక విజ్ఞానమేకాక కొంత భౌతిక విజ్ఞానమూ ఉంది. అనేకమంది ఋషులు సమాధిస్థులై ఈ మంత్రాల వివిధ అర్థాలను తెలుసుకొని వివిధ శాస్త్రాలు వ్రాశారు. వాటిలో ఐతరఋషి వ్రాసిన ఐతరేయోపనిషత్తు విశిష్టంగా ఉంది. ఏ విధంగా మానవస్త్రీ శరీరంలో రజోవీర్యాల కలయికతో పిండం ఏర్పడి పెరిగి పెరిగి మానవ శరీరంగా రూపుదిద్దుకుంటుందో అట్లే, విరాట్ పురుషుని గర్భంలో నేడు సృష్టి రూపంలో ఉన్న బ్రహ్మాండం వికసించిందంటారు ఐతర ఋషి. ఆశ్చర్యకరంగా ఆయన వివరించిన సృష్టివికాసక్రమం నేడు ఆధునిక విజ్ఞానం చెప్పే పిండవికాస

విజ్ఞానానికి (embreologyకి) సరిగా సరిపోతున్నది. అందులో ఈ పురుషసూక్తంలోని మంత్రాలుకొన్ని ఉన్నాయి. వాటికి వైజ్ఞానిక వ్యాఖ్యయూ ఉన్నది. ఇది చాలా పెద్ద విషయం. అదంతా ఈ చిన్న పుస్తకంలో తెలుపడానికి వీలు పడదు. మా ప్రచురణ 'ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (వైజ్ఞానిక వ్యాఖ్య)' అనే చిన్న పుస్తకాన్ని చదువగోరుచున్నాము. ప్రచారార్థం దాని వెల రూ. 10/ – మాత్రమే.

**ఋషి, దేవత, ఛందస్సు, స్వరము :**

వేదమంత్రాలకు 'ఋషి, దేవత, ఛందస్సు, స్వరము' అని నాలుగు విషయాలుంటాయి. వాటిని కూడా స్మరిస్తూ వేదపాఠం (పారాయణం) చేస్తారు. సంక్షిప్తంగా ఋషి అంటే ఆ మంత్రార్థాన్ని సమాధిస్థితిలో దర్శించి (అంటే పరమేశ్వరుని ద్వారా తెలుసుకొని) ప్రచారం చేసిన మొదటి వ్యక్తి. ఆ తరువాతనూ అనేకమంది ఋషులు ఆ మంత్రాల అర్థాన్ని దర్శించి ఉండవచ్చును. అయినప్పటికీ మొదటివ్యక్తికే ప్రాధాన్యత నిస్తారు. దేవత అంటే ఆ మంత్రంలో చెప్పబడిన విషయం (subject matter of the mantra). ఛందస్సు. అంటే అక్షర గణన, పాదవ్యవస్థ. స్వరము అంటే సప్తస్వరాలలో ఏ స్వరంతో ఆ మంత్రం చదవాలనేది (రాగం, తాళం వంటిది).

ఈ పురుషసూక్త మంత్రాలన్నిటికి (22 మంత్రాలకు) నారాయణుడే ఋషి. నారాయణుడు అనే పేరుగల ఋషి పైన చెప్పినట్లుగా సమాధిస్థితిలోనికి వెళ్లి మంత్రార్థదర్శనం చేసి లోకంలో ప్రచారం చేశాడు. బహుశః ఇతడు వేదకాలంనాటివాడు కావచ్చు. ఈ సూక్తంలోని చాలా మంత్రాలకు దేవత 'పురుషుడు'. అంటే ఉత్తమపురుషుడు–పురుషోత్తముడు. కొన్ని మంత్రాలకు మాత్రము వేరువేరు దేవతలున్నారు. ఛందస్సులు, స్వరములు కూడా వేరువేరుగా ఉన్నాయి. అన్నిటినీ ఇక్కడ తెలుపుటకు వీలుపడుటలేదు. మూల యజుర్వేద సంహితలో చూడగోరుచున్నాము.

ఓ3మ్

# పురుష సూక్తము

## యజుర్వేదీయము

(యజుర్వేదంలోని 31వ అధ్యాయం)

ఓం. సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।
స భూమిం సర్వతః స్పృత్వాత్య తిష్ఠ ద్దశాఙ్గులమ్ ॥

**వాక్యార్థము:-**

సహస్ర శీర్షా పురుషః = హే పరమ పురుష పరమేశ్వర! నీలోనే సమస్త ప్రాణుల శిరస్సులు ఉన్నవి. కనుక నీవు సహస్ర శీర్షుడవు. అనంతమైన శిరస్సులు కలవాడవు.

సహస్రాక్షః సహస్రపాత్ = సమస్త నేత్రాలు, సమస్త పాదాలు నీలోనే ఉన్నవి. కనుక నీవు సహస్రాక్షుడవు, సహస్రపాదుడవు.

స భూమిం సర్వతః స్పృత్వా = నీవు అన్నివైపులనుండి భూమిలో ప్రవేశించి అన్నింటిని ధరించి యున్నావు. కనుక నీవు సర్వతః స్పృతుడవు. అన్నిటిని స్పృశించువాడవు.

అత్య తిష్ఠత్ దశాంగులమ్ = నీవు పంచ స్థూల భూతాలతో, పంచ సూక్ష్మ భూతాలతో కూడియున్న ఈ జగత్తంతటా వ్యాపించియున్నావు. జగత్తును మించియు నీవు ఉపస్థితుడవై యున్నావు. కనుక నిన్ను దశాంగుళుడ వన్నారు.

అట్టి నీకు మా సహస్ర ప్రణామములు.

(సహస్రం అంటే సామాన్యార్థం వెయ్యి. ఇక్కడ అసంఖ్యాకము, అనంతము అను అర్థంలో సహస్రపదం ప్రయోగింపబడినది. లేదా సర్వత్ర అనియును చెప్పవచ్చును.)

ప్రార్థనార్థము:-

ఓ పరమపురుష పరమేశ్వరా ! నీలోనే సమస్త ప్రాణుల శిరస్సులు ఉన్నవి. సమస్త నేత్రాలు, సమస్త పాదాలు నీలోనే ఉన్నవి. నీవు అన్నివైపుల నుండి భూమిలో ప్రవేశించి అన్నిటిని ధరించి యున్నావు. పంచ స్థూల భూతాలతో, పంచ సూక్ష్మభూతాలతో కూడియున్న ఈ జగత్తంతటిని వ్యాపించి యున్నావు. నీవు జగత్తును మించియు ఉపస్థితుడవై యున్న దేవదేవుడవు. కనుక 'అత్యతిష్ఠ ద్దశాంగుళమ్' అని కీర్తింప బడుచున్నావు. నీ కివే మా సహస్ర ప్రణామములు (1)

The Almighty God, has the power of a thousand heads, a thousand eyes; a thousand feet.

Pervading the Earth on every side. He transgresses the Universe.

[Mr. Griffith translates దశాంగుళం (Dashangulam) as a space of ten fingers, which is meaningless.

Thousand means innumerable. Dash Angulam ( దశాంగుళం) the world which is made of ten parts i.e. five gross and five subtle elements. Five gross elements are earth, water, air, fire and atmosphere. Five subtle elements are sight ( రూప), smell ( గంధ), speech ( శబ్ద), taste (రస ), touch (స్పర్శ] (1)

ఓం. పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భావ్యమ్ ।

ఉతామృతత్వ స్యేశానో యదన్నేనాతిరోహతి ॥ (2)

వా. పురుష ఏవ ఇదమ్ సర్వమ్ = ఓ పరమపురుష పరమేశ్వర! నీ వల్లనే

ఈ ప్రత్యక్షాప్రత్యక్షాత్మక జగత్తంతయు సృజింపబడినది.

యత్ భూతం యత్ చ భావ్యమ్ = భూతకాలంలో ఉత్పన్నమయినవి మరియు భవిష్యత్‌లో ఉత్పన్నము కానున్నవియునైన వాటన్నిటిని సృజించువాడవును నీవే.

ఉత అమృతత్వస్య ఈశానః = మరియు ముక్త పురుషులకు అమృతత్వ ఆనందమును (మోక్షసుఖమును) ప్రసాదించువాడవును నీవే.

యత్ అన్నేనా తిరోహతి = ఆ మోక్షసుఖము పృథివ్యాదులవల్ల లభించు అన్నాది సుఖభోగములకన్నను ఎంతో ఉన్నతమైనది, ఉత్తమమైనది.

('పురుష ఏవ ఇదమ్ సర్వమ్' వాక్యంతో కొందరు 'విద్వాంసులు ఇదంతయు పరమాత్మయే' నని అర్థం చెబుతూ నవీనాద్వైతాన్ని సిద్ధింపజేయ యత్నించుచున్నారు. ఇది పూర్తిగా అసత్యం. ఆ పరమాత్మనుండియే నాలుగు వేదాలు సకల ప్రాణులు బ్రహ్మాండము ఉద్భవించాయని, వాటన్నిటిలో అతడు వ్యాపించి యున్నాడనీ ఈ పురుషసూక్తం చెబుతున్నది. అట్టి ఈ జగత్ మిథ్య ఎట్లగును? ఇవన్నియు ఏకపాదంగా ఉన్నాయి గదా! కల్పన ఎట్లగును?)

ప్రా. హే పురుషోత్తమా! భూత భవిష్యత్ కాలాలలో ఉత్పన్నమైనవి, కానున్నవియైన సమస్త లోకాలను, అందలి ప్రాణులను అన్నిటిని సృజించువాడవు నీవే. ఈ ప్రత్యక్ష పరోక్షరూప జగత్తునేగాక, జీవుల కొరకు అమృతత్వాన్ని సృజించిన వాడవును నీవే. నీవు ఈశానుడవు. అన్నిటిని నియమించి నడిపించువాడవు. పరిపూర్ణుడవు. పరమశ్రేష్ఠుడవు. (2)

God, the Lord of final emâncipation is in truth the creator of all that has been and what yet shall be; and what grows on earth. (2)

[The word (అన్న) has been wrongly interpreted as food and nourishment.

**Colebrooke translates the line :** "He is that which grows by nourishment." God is not a material object which requires nourishment for growth. He is Everlasting and Immaterial.

**Muir renders it thus:** He is also the Lord of immortality since by food. He expands. Professors, Ludwig and Wilson also give the same explanation.

**Sayana interprets it thus :-** 'He is the Lord or Distributor of immortality because He becomes the visible world in order to that living beings may obtain the fruits of their actions and gain Moksha or final liberation from their bonds ! This interpretation is highly irrational and illogical. God being immaterial cannot assume a visible form. He is spoken of in the Vedas as Akayam (అకాయం) without a body. The interpretation of the western scholers is mostly based on that of Sayana.

Swami Dayananda interprets "(అన్న)" (Anna) as Earth, out of which grow all trees vegetables and corns)] (2)

ఓం. ఏతావానస్య మహిమా తో జ్యాయాంశ్చ పూరుషః ।
పాదోఽ స్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి ॥ (3)

వా॥ ఏతావానస్య మహిమా = ఈ దృశ్యాదృశ్య బ్రహ్మాండమంతయు నీ మహిమనే తెలుపుచున్నది.

అతో జ్యాయాంశ్చ పూరుషః = కాని, నీవు వీటన్నిటికన్నను ఎంతో గొప్పవాడవు. నీ మహిమ అనంతము.

పాదో అస్య విశ్వా భూతాని = ఈ సమస్త బ్రహ్మాండములు వాటిలోని సమస్త ప్రాణులు నీలో ఏకపాదముగా (1/4వంతుగా) ఉన్నవని చెప్పవచ్చును.

త్రిపాదాస్యామృతం దివి = మిగిలిన సృష్టిలేని 3 పాదములు (3/4వంతు) జననమరణాలులేని అమృత దివ్యలోకము.

ప్రా ॥ హే పూర్ణపురుషా ! ఈ దృశ్యాదృశ్య బ్రహ్మాండములన్నియు నీ మహిమనే ప్రకటించు చున్నవి. ఈ సమస్త చరాచర జగత్తు స్థావర జంగమాత్మక ప్రాణికోటి సమస్తము నీలో ఏకపాదముగా (1/4గా) ఉన్నవి. మిగిలిన 3 భాగాలు నీ అమృతలోకమే - ముక్త పురుషులు విహరించు లోకమే. నీ కివే మా శతకోటి వందనాలు.(3)

The visible and invisible universe displays His grandeur. Yea, He is greater than this universe.

All worlds are but a part of Him, the rest lies in His immortal, Resplendent Nature.

[God is indivisible. He can't be spoken of as having parts.

The words Pad a (పాద) a fourth and Tripada (త్రిపాద) three-fourths are used figuratively to show His immensity and world's littleness)] (3)

ఓం. త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽ స్యేహా భవత్ పునః ।
తతో విష్వఙ్ వ్యక్రామత్ శనాశనే అభి ॥ (4)

వా॥ త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః = హే ఈశ్వర ! పైన వర్ణించిన మూడు పాదాల నీ విశుద్ధ స్వరూపం దివ్యంగా నున్నది.

పాదోఽ స్యేహా భవత్ పునః = మరల మరల సృష్టి స్థితి ప్రళయాలు జరుగుచున్న ఆ నీ ఏకపాదమునూ విశిష్టమైనదే.

తత్ విష్వఙ్ వ్యక్రమాత్ = ఆ విశిష్టమైన విశ్వంలోనూ నీవు అంతటా వ్యాపించి యున్నావు.

సాశనాశనే అభి = సుఖ దుఃఖానుభవం గల జీవులందును, అనుభవం లేని జడపదార్థాలందును వ్యాపించి అన్నిటికన్నా నీవు వేరుగా ఉన్నావు. (4)

ప్రా ॥ హే పరమేశ్వర ! నీ మూడు పాదాల విశుద్ధబ్రహ్మ స్వరూపం. సర్వోత్తమమైనది. సృష్టి స్థితి లయాలు జరుగు ఆ ఏక పాదమునూ విశిష్టమైనదే. జీవు లనుభవించు పదార్థములలో కూడ నీవు వ్యాపించి అన్నిటికన్నా భిన్నముగా ఉన్నావు. నీ కివే మా వందనాలు (4)

God, with three-fourths of His grandeur rises higher than all, separate from the world, enjoying liberation. With one fourth of His grandeur He creates and dissolves the universe again and again. Then pervading the animate and inanimate creation He re-

sides therein.

[What eats is the animate, and what eats not is the inanimate creation] (4)

**ఓం. తతో విరాడజాయత విరాజో అధి పూరుషః ।**
**స జాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మథో పురః ॥ (5)**

వా ॥ తతో విరాడజాయత = అట్టి నీ నుండియే ఈ విశ్వం ఆవిర్భవించినది.

విరాజో అధి పూరుషః = వీటన్నిటిని మించి అధిష్ఠాతవై యున్నదియును నీవే.

స జాతో అత్యరిచ్యత = అన్నిటిలో వ్యాపించియు అన్నిటికన్నా వేరుగా ఉన్న దేవదేవుడవు.

పశ్చాత్ భూమిమ్ అథోపురః = అనంతరం భూమిని సృజించినవాడవు నీవే. అట్టి నీకివే నా సహస్ర ప్రణామములు.

ప్రా॥ హే పురుషోత్తమా! నీనుండే సమస్త బ్రహ్మాండములు ఉత్పన్నమగుచున్నవి. వీటన్నిటిని మించి అధిష్ఠాతవై యున్నదియు, అన్నిటిలో వ్యాపించి అన్నిటికన్న వేరుగా ఉన్నదియు నీవే. మేము వసించు భూమిని సృజించునదియునూ నీవే. నీ కివే మా సహస్ర ప్రణామములు. (5)

God creates the universe, and lords over it.

He then pre-existent, remains aloof from the world, and afterwards creates the Earth. (5)

[The creation of the Earth is mentioned for distinction though Earth is ordinarily included in the creation of the universe] (5)

ఓం. తస్మాద్యజ్ఞాత్ సర్వ హుతః సంభృతం పృషదాజ్యమ్ ।
పశూంస్తాంశ్చక్రే వాయవ్యా నారణ్యా గ్రామ్యా శ్చ యే ॥ (6)

వా॥ తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః = హే పరమేశ్వర ! నీ వందరికి

పూజనీయుడవు. ఆనంద స్వరూపుడ వగుటచే నిన్నందరు కోరువారే.

సంభృతం పృషదాజ్యమ్ = నీ నుండియే సమస్త భోగ్య పదార్థాలు ఉత్పన్నమైనవి.

పశూంస్తాంశ్చక్రే వాయవ్యా నారణ్యా గ్రామ్యాశ్చ యే = సమస్త వాయుచరాలు, గ్రామ్య ఆరణ్యక పశువులు నీ నుండియే ఉత్పన్నమైనవి.

ప్రా ॥ హే పరమేశ్వర ! నీవు సర్వహుతుడవు. ఆనంద స్వరూపుడవైన నిన్నందరు కోరువారే. నీ నుండియే సమస్త భోగ్య పదార్థాలు, గ్రామ్య ఆరణ్యక పశువులు, సమస్త వాయుచరాలు ఉత్పన్నమైనవి (6)

From that great God, adorable by all, were created curd and clarified butter.

He creates the wild and tame animals swift like air. (6)

[Wild animals of the forest, like lion, and tame animals of the village like cow which are quick in motion like the air have been created by God. The word Vayavyan (వాయవ్యాన్) has been translated by some as birds of air, but Rishi Dayananda translates it as fast as like air.

అన్నం హి పృష దాజ్యం (శ.బ్రా. 3-8-4-8)

According to Shatpath Brahmana (పృష దాజ్యం) (Prishadajyam) may also mean food)] (6)

**ఓం. తస్మాద్యజ్ఞా త్సర్వహూత ఋచః సామాని జజ్ఞిరే ।**
**ఛందాంసి జజ్ఞిరే తస్మాద్యజు స్తస్మాదజాయత ॥ (7)**

వా ॥ తస్మాద్ యజ్ఞాత్ సర్వహుతః = ఓ సర్వహుత పరమేశ్వర ! అందరిచే కర్మ లను ఆహుతులను గ్రహించు దేవా !

ఋచః సామాని జజ్ఞిరే = నీనుండియే పదార్థ విజ్ఞానమును బోధించు ఋగ్వేదము మరియు ఉపాసనా విషయము వివరించు సామవేదము ఉత్పన్నమైనవి - ఋషుల హృదయాలలో ప్రకాశింపబడినవి.

ఛందాసి జజ్ఞిరే తస్మాత్ = ఆ నీనుండియే ఛందస్సులు (అథర్వ వేదము),

యజుః తస్మాత్ అజాయత = వివిధ కర్మలను బోధించు యజుర్వేదము ప్రకాశింపబడినవి.

ప్రా ॥ ఓ సర్వహుత పరమేశ్వర ! నీనుండియే ఋక్ సామ వేదాలు ఉత్పన్నమైనవి. అథర్వ యజుర్వేదములును నీ నుండియే ప్రకటింపబడినవి. నీవు సర్వజ్ఞుడవు. సర్వశక్తిమంతుడవు. ఆది గురువువు. ఆది కారణానివి (7)

From that adorable God unto whom people make every kind of sacrifice, were created the Rig Veda, Sama Veda. From Him was created the Atharva Veda and also Yajur Veda. (7)

ఓం. తస్మాదశ్వా అజాయన్త యే కే చోభయాదతః ।
**గావో హ జజ్ఞిరే తస్మాత్తస్మాజ్జాతా అజావయః ॥ (8)**

వా ॥ తస్మాదశ్వా అజాయన్త = హే పరమేశ్వర! నీనుండియే వేగవంతమైన అశ్వములు ఉద్భవించినవి. నీవే వాటిని ఆవిధంగా సృజించితివి.

యేకే చోభయాదతః = ఉభయదంతములు గల పశువులను నీవే సృజించితివి.

గావో హ జజ్ఞిరే తస్మాత్ = శ్రేష్ఠ పశువులైన గోవులను ఉత్పన్నము చేసిన వాడవును నీవే.

తస్మాత్ జాతా అజావయః = మేకలు, గొఱ్ఱెలు మొదలైనవియును నీనుండియే ఉత్పన్నమైనవి. (8)

ప్రా ॥ హే సృష్టికర్తా ! నీనుండే అశ్వాలు, అజలు (మేకలు) ఉత్పన్నమైనవి. క్రింది మీది దవడలు, దంతాలు కలిగిన పశువులన్నియు నీనుండే ఉత్పన్నమైనవి. నీవు అన్నిటిని సృజించిన ఆది దేవుడవు. (8)

From God were born horses, and from Him were born all cattle with two rows of teeth.

From Him were generated cows, from Him were goats and sheep produced. (8)

ఓం. తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః ।
తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చ యే ॥ (9)

వా ॥ తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ = అట్టి సృష్టిరూప యజ్ఞకర్తవైన నిన్నే యోగులు మానస జ్ఞాన యజ్ఞముల ద్వారా ఉపాసించిరి.

పురుషం జాత మగ్రతః = అట్టి నీవు పరిపూర్ణుడవు. సృష్టికి పూర్వమందునూ ఉండువాడవు.

తేనదేవా అయజంత = నీ నుండియే విద్వాంసు లుద్భవించిరి.

సాధ్యా ఋషయశ్చయే = సాధ్యులను(సాధనచేయు సామాన్య మానవులను), ఋషులను (సాధన ఫలాన్ని పొందిన యోగులను) సృజించిన వాడవును నీవే ! (9)

ప్రా ॥ హే పరమేశ్వర! అన్నిటి సృజించి అన్నింటికి శక్తినిచ్చు దేవదేవుడవైన నిన్నే విద్వాంసులు, ఋషులు, యోగసాధకులు ధ్యానించుచున్నారు (9)

O men know Him, the perfect God, existent before the creation of the world, and highly adorable, Him the learned, the yogis and the Rishis realise in the innermost recesses of their hearts, and worship as directed by the Vedas preached by Him (9)

**Rishis** = Men who knows the significance of Vedic verses. (9)

ఓం. యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కిమస్యాసీత్కి మ్బాహూ కిమూరూ పాదా ఉచ్యేతే ॥ (10)

వా ॥ యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్ = సృష్టికర్తవు, వేదకర్తవు, విరాట్ పురుషుడవు అయిన నిన్ను మానవ సమాజరూప పురుషునితో పోల్చినచో –

ముఖం కిమ్ ఆసీత్ = ఆ మానవ సమాజంలో ముఖతుల్యులు - ముఖం (Face or Head) వంటి వారెవరవుతారు?

కిమ్ బాహూ కిమ్ ఊరూ పాదా ఉచ్యతే = బాహువు లెవరు? ఊరువు (తొడ) లెవరు? పాదములవంటి వారెవరు? (10)

ప్రా ॥ హే పరమపురుష పరమేశ్వర! నీవు సృజించిన అత్యుత్తమప్రాణులైన మానవులలో ఎవరు ఏ స్థానం కలిగియున్నారు? ముఖతుల్యులెవరు? బాహువులవంటి వారెవరు? నడిపించు కాళ్లవంటి వారెవరని చెప్పవచ్చు?

O learned people ! you realise the perfect God in diverse ways; and describe Him in manifold manners ! In this creation of God, who is exaulted like the mouth? Who posseses the strength like arms? Who does the work of things? Who is low like the feet? (10)

ఓం. బ్రాహ్మణోఽ స్య ముఖమాసీ ద్బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥ **(11)**

వా ॥ బ్రాహ్మణోఽ స్య ముఖమాసీత్ = హే విరాట్‌పురుషా! పై ప్రశ్నలకు నీ సమాధానమేమంటే మానవ సమాజరూప పురుషునిలో విద్యావినయ సంపన్నులు, ధార్మికులు,. ఉపదేశకులు నైన బ్రాహ్మణులు ముఖము (face) గా ఉంటారు.

బాహూ రాజన్యః కృతః = నీ ఆజ్ఞాపాలకులు, న్యాయకారులు శత్రువులనుండి, దుష్టులనుండి దేశాన్ని రక్షించేవారు నైన క్షత్రియులు సమాజపురుషునికి బాహువులుగా ఉంటారు.

ఊరూ తదస్య యత్ వైశ్యః = దేశంలో ఏ కొరతా రాకుండా వ్యవసాయ పశుపోషణలతోను, క్రయ విక్రయాలతోను, పారిశ్రామిక ఉత్పత్తులతోను ప్రజలను పుష్టివంతులును జేయు వైశ్యవర్గం సమాజ పురుషునికి ఊరువులుగా (తొడలుగా) ఉంటారు.

<u>పద్భ్యామ్ శూద్రో అజాయత</u> = తమ సేవా శుశ్రూషలతో మానవ సమాజాన్ని నడిపించే శూద్రులు (చదివించినా విద్య అబ్బని కార్మికులు) మానవ సమాజరూప పురుషునికి పాదాలుగా ఉంటారు (11).

ప్రా ॥ ఓ మానవులారా ! పరమేశ్వరుడనైన నేను చెప్పునదేమన- మీలో విద్యా సదాచారవంతులైన బ్రాహ్మణులు మానవసమాజంలో ముఖం (face) మాదిరిగా ఉంటారు. అందరికి మార్గదర్శనం చేస్తారు. శౌర్యపరాక్రమాలు కలిగిన క్షత్రియులు బాహువులవలె సమాజాన్ని శత్రువులనుండి రక్షిస్తూ ఉంటారు. వ్యవసాయ వ్యాపార గోపాలనాదులను నిర్వహిస్తూ దేశాన్ని పుష్టివంతము, సంపన్నము చేయు వైశ్యులు ఊరువులవలె (తొడలవలె) ఉంటారు. ఇక మానవ సమాజాన్ని తమ సేవా శుశ్రూషలతో నడిపించే శూద్రులు (విద్య అబ్బని కార్మికులు) పాదాలవలె ఈ సమాజాన్ని నడిపిస్తారు.

In God's creation, the Brahmana in body politic is like head in the body, a Kshatriya is like arms, a Vaishya is like things, and a Shudra is considered as feet (11)

[**Brahmana** : One who knows God and the Veda, and is their devotee.

**Kshatriya** : He who is warlike in spirit, and defends the country like soldiers.

**Vaishya** : The agriculturist and tradesman, the chief supporter of the society.

**Shudra** : A labourer on whose toil and industry all prosperity ultimately depends.

This verse contains reply to the questions raised in the previous verse. The four castes in the society have been compared to the four parts of the body.

Commentators like Mahi Dhar and Ubbat translates this verse to

mean that a Brahmana is born out of God's mouth, a Kshatriya out of His arms, a Vaishya out of His things, and a Shudra out of His feet. This interpretation is wrong as God has got no body] (11)

ఓం. **చంద్రమా మనసో జాత శ్చక్షోః సూర్యో అజాయత ।**
**శ్రోత్రాద్వాయు శ్చ ప్రాణశ్చ ముఖాదగ్ని రజాయత ॥ (12)**

వా ॥ చంద్రమా మనసో జాతః = ఓ విరాట్ పురుష పరమేశ్వర! వెన్నెలను, వెలుగును, ఆహ్లాదాన్ని యిచ్చే ఈ చంద్రుడు నీ చల్లని మనసునుండి పుట్టినట్లున్నది.

చక్షుః సూర్యో అజాయత = ప్రచండ తాపంతో వెలిగిపోతున్న ఈ సూర్యుడు నీ రుద్రరూప నేత్రాలనుండి పుట్టినట్లున్నది.

శ్రోత్రాద్ వాయుశ్చ ప్రాణశ్చ = మా శరీరాలలోని దశవాయువులు ఈ బాహ్యావాయువు నీ శ్రోత్రాలనుండి (చెవులనుండి) పుట్టినట్లుగా ఉన్నది.

ముఖాద్ అగ్ని రజాయత = వివిధ జీవన కార్యాల కుపయోగపడే ఈ భౌతికాగ్ని నీ ముఖాన్నుండి (నోటినుండి) వెడలుచున్నట్లున్నది.

హే కరుణామయా ! ఈ సృష్టిలో అంతటా మాకు నీ కరుణయే కానవచ్చుచున్నది.

(కొన్ని సంవత్సరాల క్రిందట చంద్రునిపైనుండి వ్యోమగాములు తీసుకువచ్చిన చంద్రశిలలను పరిశోధించిన వైజ్ఞానికులు అవి భూ శిలలకన్న భిన్నంగా ఉన్నాయన్నారు.

"చంద్రుడు భూమి నుండి విడివడిన ఉపగ్రహం" అనే ఆలోచన సందేహాస్పదమన్నారు.

(ఈ మంత్ర వైజ్ఞానికార్థం మా ప్రచురణ 'ఐతరేయ ఉపనిషత్తులోని సృష్టి కథ' అను పుస్తకములో నున్నది)

ప్రా. ఓ పరమేశ్వర ! వెన్నెలను వెలుగును, ఆహ్లాదాన్ని ఇచ్చే ఈ చంద్రుడు నీ చల్లని మనస్సునుండి పుట్టినాడేమో ! అనిపిస్తున్నది. ప్రచండ తాపంతో వెలిగిపోతున్న ఈ సూర్యుడు నీ రుద్రరూప నేత్రాలనుండి

పుట్టినట్లున్నది. మా శరీరాలలోని దశవాయువులు, ఈ బాహ్యావాయువు నీ శ్రోత్రాలనుండి (చెవులనుండి) ఉద్భవించినట్లున్నది. వివిధ జీవన కార్యాల కుపయోగపడే ఈ అగ్ని నీ ముఖాన్నుండి (నోటినుండి) వెడలినట్లున్నది.

The moon was engendered from His strength of knowledge; the sun was born from His power of refulgence, the air and ten vital breaths were born from His power of space, fire was born from His power of destruction. (12)

**[Ten vital breaths :** Pran air in the heart, Apan in the anus, Saman in the navel, Udan in the throat, Vyan in the whole body and Nag, Kurma, Krikal, Dev Dutt, Dhananjaya are Upapranas)**]** (12)

**ఓం. నాభ్యా ఆసీదన్తరిక్షం శీర్ష్ణో ద్యౌః సమవర్తత ।**
**పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రా త్తథా లోకాం అకల్పయన్ ॥ (13)**

వా॥ నాభ్యా ఆసీ దన్తరిక్షమ్ = హే పరమేశ్వర ! భూలోక ద్యులోకాల మధ్యగల ఈ అంతరిక్షం విరాట్ పురుషుడవైన నీ నాభివలె నున్నది.

శీర్ష్ణో ద్యౌః సమవర్తత = విశాలమైన ద్యులోకం - సూర్య నక్షత్రాదులుండు లోకం నీ శిరస్సువలె నున్నది.

పద్భ్యాం భూమిః దిశః = భూమి నీ పాదముల వలెను, దిక్కులు నీ చెవుల వలెను ఉన్నవి.

తథాలోకాన్ అకల్పయన్ = అట్లే ఈ లోక లోకాంతరాలన్నీ నీ మహిమనే తెలుపుచున్నవి.

ప్రా ॥ హే ఈశ్వరా! భూలోక ద్యులోకాల మధ్యగల ఈ అంతరిక్షం విరాట్ పురుషుడవైన నీ కడుపు మాదిరిగా నున్నది. విశాలమైన ద్యులోకం నీ శిరస్సువలె నున్నది. భూమి పాదములవలె ఉన్నది. దిక్కులు నీ చెవులవలె నున్నవి.

నీ నిరాకార స్వరూపాన్ని అర్థం చేసుకోలేని మందమతులమైన మేము నీ విరాట్ స్వరూపాన్ని కల్పన చేసుకోవటం కన్న వేరే మార్గమేముంది? అంతటా

నీ విభూతులనే (మహిమలనే) గాంచుచు నీ భక్తి సలిపెదము గాక ! (13)

Mid-air was produced from His central power of space; from His excellent head-like strength was fashioned the sky. Earth came into being from primordial power; and the quarters from His power of space. Similarly were other regions created (13)

ఓం. **యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత ।**
**వసంతోऽ స్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః ॥ (14)**

వా ॥ యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత = హే పరమపురుష పరమేశ్వర ! ప్రాణులకొరకు భూమిపై ఏర్పరిచిన ఋతుక్రమం నీవు నిర్వహించుచున్న యజ్ఞమువలె నున్నది. (విద్వాంసులంతా ఆ విధంగా నిన్ను భావించి నీవు ఏర్పరిచిన ఋతుచక్రానికి అనుగుణంగా అగ్నిహోత్రాన్ని నిర్మించినారు.)

వసంతః అస్య అసీత్ ఆజ్యం = ఆ ఋతుచక్రయజ్ఞంలో వసంత ఋతువు ఆజ్యంవలె (నేతివలె) సర్వప్రాణులకు ఆహ్లాదాన్ని కలిగించుచున్నది. పాత ఆకులు ఎండి రాలిపోగా చెట్లు క్రొత్తగా చిగురించి పూలు పూయుచున్నవి. ప్రకృతిలో కలుగుచున్న ఈ శుభసూచిక పరిణామమును చూచి పక్షులు కిలకిలా రావములు చేయుచున్నవి. మధుమక్షికములు మధువు కొరకు ఆసక్తితో ఝుంకరించుచున్నవి. మానవులయితే ఆ శోభను చూచి కవిత లల్లుచున్నారు. ప్రకృతి ప్రసాదించు ఫలముల కొరకు కలలు కంటున్నారు.

గ్రీష్మ ఇధ్మః శరత్ హవిః = ఋతుచక్రంలోని గ్రీష్మ ఋతువు ఇధ్మముల వలె (అగ్నిహోత్రంలోని సమిధల వలె) నుండగా, శరదృతువు సోమలతాది హోమద్రవ్యాల వలె నున్నది. ఈ ఋతువులన్నియు మా కవసరమైనవే. దేని రమణీయత దానికున్నది. గ్రీష్మ ఋతువులేకున్న వర్షము లెట్లు కలుగును? వర్షములు లేకున్న పంటలు ఎట్లు పండును? పంటలు లేకున్న ప్రాణులెట్లు బ్రతుకును? అట్లే శరత్, హేమంత శిశిర ఋతువులునూ అవసరమే. నీవు సర్వజ్ఞుడవు కదా ! నీ సృష్టిలో వ్యర్థమైన దేముండును? ఏదైనా వ్యర్థమైనదని మా కనిపిస్తే అది మా అజ్ఞానమే. నీ సృష్టి లోపరహితమైన పరిపూర్ణ యజ్ఞము.

మేమును నీవంటి యజ్ఞకర్తల మగునట్లు అనుగ్రహింపుము.

ప్రా ॥ హే పరమేశ్వర ! సర్వప్రాణి హితైషివై ఈ భూమిపై నీ వేర్పరచిన ఋతుక్రమం నీవు చేయు యజ్ఞంవలె నున్నది. వసంత ఋతువు ఆజ్యం (నెయ్యి) వలెను, గ్రీష్మ ఋతువు జ్వలించు సమిధలవలెను ఉన్నవి. శరదృతువు సోమలతాది హోమద్రవ్యాల వలె నున్నది.

When the learned perform, meditating upon the Adorable God, the sacrifice of mental worship, then morning is its butter, mid-day its fuel, and mid-night its oblation (14)

[Sacrifice = Yajna

In the absence of outward provisions a mental sacrifice is to be performed. Then morning, mid-day and mid-night should be imagined to serve the purpose of butter, fuel and oblation of the yajna] (14)

ఓం. సప్తాస్యాసన్పరిధయ స్త్రిః సప్త సమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానా అబధ్నన్పురుషం పశుమ్ ॥ **(15)**

వా ॥ సప్తస్యాసన్ పరిధయః = హే ఈశ్వర ! విద్వాంసులు కల్పించిన మానసయజ్ఞంలో గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తీ, త్రిష్టుప్, జగతీ అను పేర్లతో వ్యవహరింపబడే సప్త (7) వేద ఛందస్సులు యజ్ఞపరిధులుగా ఉంటాయి. అంటే యజ్ఞకుండం చుట్టూ చుట్టబడిన ఏడుదారాలవలె ఉంటాయి.

త్రిః సప్త సమిధః కృతాః = 3X7=21 తత్త్వాలతో కూడిన సూక్ష్మ శరీరం సమిధలుగా ఉంటుంది.

దేవా యద్యజ్ఞం తన్వానా = విద్వాంసులు అట్టి మానస యజ్ఞాన్ని కల్పించి నిర్మించారు.

అబధ్నన్ పురుషమ్ పశుమ్ = తెలుసుకోదగిన, సాక్షాత్కారం చేసుకోదగిన పరమపురుషుడవైన నిన్ను హృదయ ప్రాంతమందు బంధించుచున్నారు. అనగా-ధ్యానించుచున్నారు.

ప్రా ॥ హే ఈశ్వర ! విద్వాంసులు కల్పించిన మానస యజ్ఞంలో

గాయత్ర్యాది సప్త ఛందస్సులు పరిధులవలె - చుట్టూ చుట్టబడిన ఏడు వరుసదారాల వలె ఉంటాయి. 21 తత్త్వాలతో కూడిన సూక్ష్మ శరీరం సమిధలుగా ఉంటుంది. ఇవే పురుషుణ్ణి (జీవున్ని) ఈ శరీరంలో కట్టివేశాయి (బంధించాయి).

(వివరణ : వేదశాస్త్రాల నధ్యయనం చేసిన విద్వాంసులు విరాట్పురుషుని వేదమంత్రాలతో స్తుతి ప్రార్థనోపాసనలు చేయునపుడు ఒక మానస యజ్ఞం నిర్మింపబడుతుంది. ఆ మానస యజ్ఞంలో వేదాలలోని సప్త ఛందస్సులు పరిధులుగా ఉంటాయి. సూక్ష్మ శరీరంలోని 21 తత్త్వాలు సమిధలుగా ఉంటాయి.

జీవుడు ఈ శరీరాన్ని వదిలివెళ్లేటప్పుడు పై సూక్ష్మ శరీరాన్ని కూడ తనవెంట తీసుకు వెడతాడు. దానిలోనే మనం చేసిన కర్మలు, సాధనలు అన్నీ సంస్కారాలుగా ఉంటాయి. ఆ సంస్కారాలే క్రొత్త శరీరంలో పునాదులుగా ఉండి సుఖదుఃఖ భోగాలను, ఉన్నతిని లేదా అవనతిని కలిగిస్తాయి. పురుషార్థంతో-విశేష ప్రయత్నంతో మనం చెడు సంస్కారాలను పోగొట్టుకోవచ్చు. మంచి సంస్కారాలను పెంచుకోవచ్చు. అందుకు పరమేశ్వరోపాసన చేయుటం, ధ్యానం చెయ్యటం ముఖ్యసాధనంగా చెప్పబడుతుంది. ఆ విషయమే ఈ మంత్రంలో సంక్షిప్తంగా, సూక్ష్మరూపంగా చెప్పబడింది.)

The mental sacrifice, performing which, the learned concentrate upon the knowable God in their hearts, has seven coverings and twenty one kinds of kindling fuel.

[Seven coverings are the seven meters Chhandas in which the vedic verse encompass the yajna.

**Twenty one kinds of fuel :-** Matter, Mahat Tatva (intellect), Ahankar (Egotism), five subtle elements (సూక్ష్మభూతాలు), five gross elements (స్థూలభూతాలు), five organs of cognition (జ్ఞానేంద్రియాలు), Satva, Rajas, Tamas, three qualities. These twenty one materials serve as fuel to the contemplative yajna, the learned perform.

Griffith says - This pantheistic hymn, which is generally called the Purusha sukta, is of comparatively recent origin. Nothing can be farther from truth than this statement. The hymn is the part and parcel of the yajur veda, and is hence as old immemorial as the Veda itself ] (15)

ఓం. యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తే హ నాకం మహిమానః సచన్త యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః ॥

**(16)**

వా ॥ యజ్ఞేన యజ్ఞమ్ అయజన్త దేవాః = హే పరమేశ్వర ! పై విధంగా దేవతలు (విద్వాంసులు) యజ్ఞస్వరూపుడవైన నిన్ను మానసయజ్ఞంతో పూజింతురు.

తాని ధర్మాణి ప్రథమాని ఆసన్ = ఆ ధారణ ధ్యాన సమాధిరూప మానస యజ్ఞమే అన్నిటికన్నా గొప్పది.

తే హ నాకం మహిమానః సచన్త = దానితోనే వారు మహత్వపూర్ణమైన స్థితిని – ముక్తిని పొందిరి.

యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః = పూర్వఋషులు, యోగులు సాధన చేసి ఏ తృతీయధామాన్ని పొందిరో, దానిని ఈ మానసయజ్ఞశీలురును పొందిరి.

భా ॥ హే పరమపురుష ! పై విధంగా దేవతలు యజ్ఞస్వరూపుడవైన నిన్ను మానసకల్పిత యజ్ఞముతోనే పూజింతురు. ఆ ధారణ ధ్యాన సమాధి రూప మానస యజ్ఞమే అన్నిటికన్న గొప్పది. దానితోనే పూర్వ ఋషులు, యోగులు సాధనచేసి గొప్ప సుఖాన్ని, ముక్తిరూప ఆనందాన్ని పొందారు. ఓ దేవా ! నాకును అట్టి శక్తియుక్తుల నిమ్ము. (16)

The learned worship God through mental contemplation. Their holy ordinances for the worship of God are immemorial. Such noble souls in particular enjoy the happiness of final be atitude, in which dwell the ancient yogis and learned devotees. (16)

[Holy ordinances :- The teachings of the Vedas] (16)

ఓం. అద్భ్యః సంభృతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే ।
తస్య త్వష్టా విదధద్రూపమేతి తన్మర్త్యస్య దేవత్వ మాజానమగ్రే ॥
(17)

వా ॥ అద్భ్యః సంభృతః ఽ పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే = ఓ విరాట్ పురుషా ! ఈ పృథివీ జలములకంటెను, విశ్వకర్మగా పిలువబడు సూర్యుని కంటెను ముందుగా నీవు హిరణ్యగర్భుడిగా విద్యమానుడవై యుంటివి.

తస్య త్వష్టా విదధత్ రూపమేతి = నీ గర్భంలో సూక్ష్మరూపంలో నున్న ఆ మూల ప్రకృతినే నీవు జగద్రూప మొనర్చితివి.

తత్ మర్త్యస్య దేవత్వం ఆజానమ్ అగ్రే = అట్టి నిన్ను మేము చక్కగా తెలుసుకొని, ఆదిలో వేదం ద్వార నీవిచ్చిన ఆజ్ఞలను పాలించి మేమును దేవత్వమును పొందుదుము గాక !

ప్రా ॥ ఓ సృష్టికర్తవైన ఈశ్వర ! ఈ పృథ్వీ జలముల కంటెను, విశ్వకర్మగా పిలువబడు సూర్యుని కంటెను ముందుగా నీవు హిరణ్య గర్భుడిగా విద్యమానుడవై యున్నావు. ఇవన్నీ నీలోనే సూక్ష్మరూపంలో ఉండెను. దానినే నీవు జగద్రూప మొనర్చితివి. అట్టి నిన్ను మేము చక్కగా తెలుసుకొని వేదం ద్వారా నీ విచ్చిన ఆజ్ఞలను పాలించి మేమును దేవత్వమును పొందుదుము గాక! (17)

God creates in the beginning with His urge this world nourished by waters, earth and sun. Fixing its form, He assigns in the beginning the wisdom and duties of mankind. (17)

ఓం. వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్య వర్ణం తమసః పరస్తాత్ ।
తమేవ విదిత్వాతి మృత్యు మేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ ॥ (18)

వా ॥ వేద అహమ్ ఏతమ్ పురుషమ్ మహాన్తమ్ = హే పరమపిత పరమేశ్వర ! నేను నీ మహాన్త రూపాన్ని వేదం ద్వారా చక్కగా తెలుసుకొంటిని.

ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ = ఆ నీవు అజ్ఞాన అంధకారానికి

ఆవల సహస్రకోటి సమ ప్రభతో వెలుగొందుచున్నావని గ్రహించితిని.

తమేవ విదిత్వా అతి మృత్యుమేతి = అట్టి నిన్ను చక్కగా తెలుసుకొని సాధన చేసి సాక్షాత్కారం చేసుకున్నవారు మాత్రమే మృత్యువును తరించగలరు.

నాన్యః పన్థా విద్యతే అయనాయ = మృత్యువును తరించుటకు ఇంతకన్న వేరొక సరళమార్గం లేనేలేదు.

అంతర్యామియైన ఓ పరమేశ్వరా ! మమ్ము ఆ యోగ మార్గాన నడిపించి నీ దరి జేర్చుకొమ్ము.

ప్రా ॥ ఓ పరమపిత పరమేశ్వర ! అజ్ఞానంధకారానికి ఆవల సహస్రకోటి సమ ప్రభతో వెలుగొందు మహోన్నత పురుషుని – పరమేశ్వరుని దర్శించినవారే ఈ మృత్యురూప సంసార సాగరాన్ని తరించి అమృతత్వ ఆనందాన్ని పొందుదురు. దీనికన్న వేరొక సరళమార్గం లేనేలేదు. అంతర్యామివైన ఆత్మేశ్వరా! మమ్ము ఆ మార్గముననే ప్రేరేపించి నీవైపు నడిపించుకొమ్ము.

I know this Mighty, Perfect God, who is refulgent like the sun and free from ignorance.

He only who knows Him feels not the pangs of death. For salvation there is no other path save this.

[Knowledge of God alone is the sure path for salvation)] (18)

**ఓం. ప్రజాపతి శ్చరతి గర్భే అన్తరజాయమానో బహుధా వి జాయతే ।**
**తస్య యోనిం పరిపశ్యంతి ధీరా స్తస్మిన్ హ తస్థు ర్భువనాని విశ్వా ॥ (19)**

వా ॥ ప్రజాపతిః చరతి గర్భే అన్తః = హే ఈశ్వర ! నీవు ప్రజాపతివి. ప్రజలందరిని – మానవ మాతృలందరిని పాలించి పోషించువాడవు. అట్టి నీవు జీవాత్మలమైన మా గర్భములలో (హృదయములలో) విద్యమానుడవై యున్నావు.

అజాయమానో బహుధా వి జాయతే = నీవు జన్మించనివాడవే అయినను అనేక విధములుగా ప్రకటితమగుచున్నావు. నీ మహిమలను చూపుచున్నావు.

<u>తస్యయోనిం పరిపశ్యంతి ధీరాః</u> = అట్టి నిన్ను యోగులు సర్వత్ర నీ మహిమలను దర్శిస్తూ నీ అసలు స్వరూపాన్ని దర్శించ అంతర్ముఖులై ధ్యానశీలురగుదురు.

<u>తస్మిన్ హ తస్థుః భువనాని విశ్వా</u> = అట్టి నీయందే ఈ సమస్త లోక లోకాంతరాలు స్థితములై యున్నవి.

ప్రా ॥ హే ప్రజాపతి ! ప్రజాపాలక పరమేశ్వర ! నీ గర్భంలోనే సమస్త ప్రాణులు వసించి యున్నవి. నీవే అన్నిటియందును, అందరి హృదయాలలలోను విద్యమానుడవై యున్నావు. సమస్త భువనాలలోను, ప్రాణులలోను బహువిధములుగా ప్రకటితుడ వగుచున్నావు. అట్టి నిన్ను శరణు పొందినవాడే ధ్యాన శీలుడై సర్వత్రా నిన్ను దర్శించును. నిన్ను పొందును. (19)

God, the Protector of men, pervades the soul in the womb and the hearts of all. Being unborn, He manifests himself in various ways.

Yogis alone realise His true nature. In Him stand all existing worlds.(19)

**ఓం. యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః ।**

**పూర్వో యో దేవేభ్యో జాతో నమో రుచాయ బ్రాహ్మయే ॥ (20)**

<u>వా ॥ యో దేవేభ్య ఆతపతి</u> = ఏ పరమేశ్వరుడు దేవతలకు (విద్వాంసులకు) జ్ఞాన ప్రకాశము నిచ్చునో,

<u>యో దేవానాం పురోహితః</u> = ఎవడు విద్వాంసులకు పురోహితుడో ముందుగానే వారి హితమునే కోరి మార్గదర్శనం చేయునో,

<u>పూర్వో యో దేవేభ్యో జాతః</u> = ఎవరు సమస్త విద్వాంసులకు ఆదిగురువో, ఆది ఋషులకన్న ముందే తాను విద్యమానుడై యుండునో

<u>నమో రుచాయ బ్రాహ్మయే</u> = అట్టి రుచికర (ప్రీతికర) పరబ్రహ్మకు మా నమస్సులు.

(ఋగ్వేదాది భాష్య భూమిక నుండి ఈ మంత్రార్థం గ్రహించబడినది)

ప్రా ॥ గ్రహ ఉపగ్రహాలకు వెలుగును, వేడిని ప్రసాదించు సూర్యుని సృజించిన పరమేశ్వర ! ఈ సూర్యుడు పురోహితుడు-మిగిలిన దేవతల హితాన్ని కోరేవాడు. వీటన్నిటికన్న ముందుగా ఉత్పన్నమైనవాడు. గ్రహ ఉపగ్రహాలలోని ప్రాణులన్నిటికి వలయు అన్నము నుత్పన్నము చేయువాడు. అట్టి సూర్యోత్పాదక పరమేశ్వరా ! మేము నిన్ను మాత్రమే ఉపాసింతుము గాక ! మిగతా దేవతలను అగ్నిహోత్రం ద్వారా సేవించి వాటినుండి తగిన ఉపకారమును పొందుదుము గాక !

The Sun gives light and heat to the useful objects like the Earth; stands first and foremost in the centre for the good of all heavenly bodies, is born are the Earth etc, and being the creation of Gracious God gives us food. (20)

ఓం. **రుచం బ్రాహ్మం జనయన్తో దేవా అగ్రే తదబ్రువన్ ।**
**యస్ త్వైవం బ్రాహ్మణో విద్యా త్తస్య దేవా అసన్వశే ॥ (21)**

<u>వా ॥ రుచం బ్రాహ్మం జనయంతః</u> = హే పరమేశ్వర ! ఏ విద్వాంసులు నీ రుచికర (ప్రీతికర) బ్రహ్మజ్ఞానాన్ని ఉపాసిస్తూ ఉపదేశింతురో,

<u>దేవాః అగ్రే తదబ్రువన్</u> = ఏ ఋషులు ఆదిలో జీవేశ్వర ప్రకృతుల సత్యజ్ఞానమును బోధించిరో,

<u>యః త్వా ఏవమ్ బ్రాహ్మణః విద్యాత్</u> = వారే నిజమైన బ్రాహ్మణులు - బ్రహ్మనిష్ఠులు అని తెలుసుకొందము గాక !

<u>తస్య దేవాః అసన్ వశే</u> = అట్టి వారికే మేము వశులము అగుదుము గాక ! వారినే గురువులను చేసుకొందుము గాక ! ఆ వేదమార్గముననే మేమును పయనింతుము గాక !

ప్రా ॥ ఓ పరమేశ్వర ! ఏ విద్వాంసులు నీ యథార్థ స్వరూపాన్ని ఉపాసిస్తూ ఉపదేశింతురో- జీవేశ్వర ప్రకృతుల స్వరూప స్వభావాలను వివరించి చెప్పుదురో వారే నిజమైన బ్రహ్మనిష్ఠులు. అట్టివారినే మేము గురువులను

చేసుకొందుము గాక ! ఆ వేదమార్గముననే మేము పయనింతుము గాక !(21)

The learned persons in the beginning making thee a lovable devotee of God, preach the eternity of God, Soul and Matter. The Brahmana who thus knows the nature of God, shall have learned persons in his control.

[Thee :- A devotee of God) ] (21)

ఓం. శ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యా వహో రాత్రే పార్శ్వే

నక్షత్రాణి రూపమశ్వినౌ వ్యాత్తమ్ ।

**ఇష్ణన్నిషాణాముం మ ఇషాణ సర్వలోకం మ ఇషాణ ॥ (22)**

వా ॥ శ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ = హే జగదీశ్వర ! ఈ సృష్టిరూప శ్రీ మరియు లక్ష్మీ (శోభాలక్ష్ములు) నీకు పత్నులవలె ఉన్నవి.

అహోరాత్రే పార్శ్వే = అహోరాత్రములు (రేయింబవళ్లు) నీకు రెండు పార్శ్వముల-వలె నీ ఈ సృష్టిలో ముందు వెనుకల వలె నున్నవి.

నక్షత్రాణి రూపమ్ = నక్షత్రరాశులు నీ అద్భుత భౌమ్య విశాల రూపాన్ని ప్రకటిస్తున్నవి.

అశ్వినౌ వ్యాత్తమ్ = అశ్వినీ దేవతలు (సూర్యచంద్రులు) నీ వికసించిన ముఖమువలె కనబడుచున్నవి.

ఇష్ణన్ ఇషాణ అముమ్ మే ఇషాణ = అట్టి నీ విరాట్ స్వరూపాన్ని మేము కోరుదుము గాక ! సేవింతుము గాక ! ఉపాసింతుము గాక !

సర్వలోకం మే ఇషాణ = మాకు సర్వలోకములు సర్వసుఖాలు ప్రాప్తించును గాక!

ప్రా ॥ ఓ జగదీశ్వర ! ఈ సృష్టిరూప లక్ష్మి, శ్రీలు – ఐశ్వర్య శోభలు రెండును నీకు పత్నులవలె నున్నవి. అశ్వినీ దేవతలవంటి రేయింబవళ్ళు, నీ ఈ సృష్టిలో పార్శ్వములవలె – ముందు వెనుకలవలె నున్నవి. సూర్య చంద్రులు నీ ముఖము వలె నున్నవి. నక్షత్రాలు శిరస్సువలె నున్నవి. నీ ఈ విరాట్

స్వరూపాన్ని సేవిస్తూ, ఉపాసిస్తూ నిన్ను పొంద యత్నింతుముగాక!

నీవు మాకు ఇహలోక సుఖాలను, పరలోక సుఖాలను ప్రసాదింపుము. పరోక్ష సుఖరూప ముక్తిని ప్రసాదింపుము. నీ విరాట్ స్వరూపానికివే మా శత సహస్ర ప్రణామములు. (22)

Grandeur and fortune are your two wives. Your sides are your and night; constellation are your form; the Ashwins are you open mouth. Imploring grant salvation to me, grant me all sorts of knowledge and pleasures.

**[Thy Gods Ashwins :** The Sun and Moon. Just as wives serve and protect thier husbands, so God protects all through his grandeur and might.

Day and night are two phases of the sun. When it rises and shines it is day, when it sets it is night. So when God shines in our hearts, it is day through his lustre and knowledge. It is night when darkness (ignorance) prevails in the soul, and we forget God. All luminous objects exhibits beauty and glory of GOd. In this Purushasukta the metamorphosic nature of God is spoken figuratively**]** (22)

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

ఓ 'ఓం' నామక సృష్టి స్థితి లయ కర్తా – పరమేశ్వర !
మా ఆధ్యాత్మిక, ఆది భౌతిక, ఆది దైవిక దుఃఖాలను శాంతింప జేసి
పరమానందమును ప్రసాదింపుము.

శమ్ ఇతి ఓమ్

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

## సుమహర్షి - డా. కోదూరి సుబ్బారావు గారి రచనలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స(40=00), వేదాలలో జలచికిత్స (20=00), వైదిక క్రాంతి పథం(15=00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము(15=00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణీ స్త్రీ) (20=00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20=00), గర్భాధాన విజ్ఞానము (30=00), మానవ ధర్మము (25=00), అశ్వినీ దేవతలు(20=00), సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనము(20=00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30=00), గంగాధర శివుడు (5=00), గోమాత (30=00), గాయత్రీ విజ్ఞానం (50=00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60=00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (4=00), దైనిక అగ్నిహోత్ర విధి (4=00), మన ఇతిహాసం(70=00), మన వేదశాస్త్రాల పరిచయం (50=00), చతుర్దశ భువనములు (10=00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10=00), వైదిక సరస్వతీ స్తోత్రము (10=00), వేదాల వెలుగుచూపే ఆర్యసమాజం (20=00), మాతా పుత్రికల జ్ఞానచర్చ (60=00), పెండ్లినాటి ప్రమాణాలు (ముద్రణలో)

## ఇతర విద్వాంసుల రచనలు

యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00), వైదిక వివాహ వైశిష్ట్యము (8=00), ధర్మవీర్ పం. లేఖరాం(3=00), మహర్షి మనువుపై విరోధమెందుకు (3=00), వేదాలలో అప్సరస గంధర్వులు (2=50), యజ్ఞోపవీత వైశిష్ట్యము(2=00), లక్ష్మీసూక్తము (2=00), శాంతిప్రార్థన (2=00), దిగ్రేట్ గాయత్రీ(2=00), వైదిక అర్థనీతి (2=00), బ్రహ్మచర్య విజ్ఞానము (15=00), శ్రీ దయానంద హృదయము (12=00), స్వరాజ్యసంగ్రామములో ఆర్యసమాజము(8=00), సత్యధర్మవిచారణ(6=00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10=00), మరణానంతరం జీవుని ప్రయాణం (40=00), ప్రణవ స్తోత్రము (10=00)

# PURUSHA SUKTAMU

Gayatri Series : 54.

Rs. 20/-



## పరమేశ్వరుని నిజ స్వరూపము

ఓం. సపర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం
శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషి పరిభూః
స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్
వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥ – యజుర్వేదము (40-8)

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, స్థూల సూక్ష్మ కారణ శరీరరహితుడు, వ్రణరహితుడు, స్నాయు బంధనాలు (జన్మబంధనాలు) లేనివాడు, శుద్ధుడు, అపాప విద్ధుడు, వేదకవి, జీవుల మనోవృత్తుల నెరుగువాడు (దుష్టుల మదము నణచువాడు), లోక లోకాంతరాల నన్నిటిని ఆవరించి యుండువాడు, స్వయం సత్తాగలవాడు. అతడు సృష్టిలో ఏ పదార్థము నెట్లు సృజింపవలెనో అట్లు సృజించు సృష్టికర్త. వేదాల ద్వారా ఆ సృష్టిజ్ఞానాన్నిచ్చిన జ్ఞానదాత. ఈ సృష్టిని శాశ్వతులు, జ్ఞానవంతులునైన జీవుల కొరకే సృజించెను.

God is all pervading, lustrous, bodiless, flawless, sinewless, pure, unpierced by evil. He is omniscient, knower of the hearts of all, censure of the sinful and self existent. He truly reveals through the vedas all things for His subjects (souls) from His immemorial attributes free from birth and death.

Published by :
**Gayatri Ashrama Trust,**
Arya Samaj, Medibavi, Warisguda, Secunderabad - 500 061.
(Secretary : Sri K.P. Narsing Rao, Cell: 9848011073.)